సీ॥ "దుగ్ధాంబునిధినిట్టిఁదోఁచెనో యని శేషుఁ
బాన్పుగా హరినిటఁ బవ్వడింపఁ
నాదవి సుధారస ముప్పొంగె నోయని
దేవతల్ తనివోవఁ ద్రావఁ దలఁపఁ
దొలఁకాడుమిన్నేఱు వెలివిరిసెనో యని
లీల సురాంగన లోలలాడఁ
పాదరసం బుర్విఁ బరఁగెనో యని సిద్ధ
నికరంబు కలశముల్ నించికొనఁగఁ

పాండురాంగుండు విశ్వరూపంబు దాల్చి
యెలసెనోయనిసద్భక్తి నెలమిఁ గొలువ
నఖిలజీవుల కానంద మతిశయిల్ల
నచ్చ వెన్నెలవిమలమై యలరెకానె."

—కుమా = ఆ.౮

సీ॥ గంగాప్రవాహంబు గాఁబోలునని వశి
ష్ఠాదు లనుష్ఠాన మాచరింప
నమృతంబు వెల్లువయని నిలింపాదులు
మునుకొని దోసిళ్ళ ముంచికోల
దుగ్ధాంబునిధి యని తోయజాక్షుఁడు శేష
పర్యంక మిడుకొని పవ్వడింపఁ
బరమేశువిశ్వరూపం బని బ్రహ్మాదు
లమర దండ ప్రణామములు సేయఁ

దలఁపఘానఘాంతరముల కొలఁదెతెలిసి
పెరసియెన్నిది దిక్కులఁ బొరలిపొరలి
దట్టముగనంతకంతకుఁ దనరితనరి
యుట్టిలంబుగవెన్నెల నిట్టవొడిచె."

—జక్కన విక్రమార్క చరిత్రము.

వేయేల. యితని కావ్యమును జక్కన, కేతన, మంచన, నాచన సోముఁడు, అమరేశ్వరుఁడు, పిన్నకోట పెద్దన, సూరనలు, రామలింగఁడు, కొందఱు లాక్షణికులును చదివినట్లు తెలియుచున్నది. "త ఏవపదవిన్యాసా

స్తావేవార్థవిభూతయః। తథాపినప్రం భవతి కావ్యం గ్రథనకౌశలాత్" అను వాక్యము కేతన సోమనాథాదులయందుఁగూడ వ్యక్తమగుచున్నది.

నన్నెచోడుని కుమారసంభవము నానావిధాలంకారములకును, నపూర్వ వ్యాకరణవిశేషములకును, కొన్ని శబ్దచిత్రములకును, భావ, వ్యంగ్య, ధ్వనులకును లక్ష్యము లిచ్చుటయందుఁ బ్రథమగణ్యముగా నున్నది. ఈ కవికిఁ బూర్వము సంస్కృతమున నెందఱో మహాకవులున్నను గ్రంథచౌర్య మగ పడదు. "మునుమునసత్కవితావ్రజము। నదరకవిలుకాని పట్టినమ్మును బరహృద్భి। దమై తలయూపింపనియది కావ్యమె వాని పట్టినదియుం గరమే" యనునది మాత్రమే "కింకవేస్తస్యకావ్యేన కింకాండేన ధనుష్మతః పరస్యహృదయేలగ్నం నఘూర్ణయతి యచ్ఛిరః"యను శ్లోకార్థమునుండి గ్రహింపఁబడినది. దీనిలోఁ గొన్ని యత్యాశ్చర్యజనకములగు భావములుగలవు. అట్టిపద్యము లీ ముద్రిత భాగములోనే కొన్నిగలవు. వానికిఁజూడఁగా 'తత్తత్సమగ్ర బహుశాస్త్ర విమర్శసిద్ధవైదగ్ధ్యా దిగ్ధమతయో బహవః కవంతాం, యత్కించిదస్తి తు మహాకవి వాగ్రహస్యంస్వప్నేఽపి తస్యకిలతేన దిశం స్పృశంతి' యనియు, ఆ'సంసారం (సృష్టి) కవిపుంగవైః ప్రతిదివసగృహీతసారోఽపి। అద్యాప్యభిన్న ముద్ర ఇవ జయతి వాక్పరిస్పందః' అని మంకుకవాక్పతికవులు సూచించిన వాక్యములు నిక్కములని తోచుచున్నది. మఱియు నీకవి,'ఓలినకడచననఱువది। నాలుగు విద్యలను నేర్పు నైసర్గికమై। వాలినసుకవులకుంగా కేలతరమెకృతులు చెప్ప నెవ్వరికైనన్' అని చెప్పుకొన్నట్లు సర్వజ్ఞుఁడని చెప్పుటకుఁ దగిన సూచనలు కావ్యములో నగపడుచున్నవి. ఆంధ్రకవులలో నిట్టివారు తిక్కన, నాచనసోముఁడు, ఎఱ్ఱాప్రెగ్గడయు మాత్రమే.

ఇతని కాలములో దీర్ఘము మీఁది యర్ధబిందువు పూర్ణబిందువుగానే వాడు చున్నట్లును కృష్ణదేవరాయల కాలమునకే యది యర్ధబిందు వయ్యెననియు నీకృతివలనఁ దేలుచున్నది. దీర్ఘముమీఁద నెఱసున్నలు సోముఁడుకూడఁ బ్రయోగించి యున్నాఁడు. చూడుఁడు;ఉ.''ఎంచిన ప్రేమనేవపకమిమ్మని రుక్మిణి మున్ను వేఁడుటం। పూంచినపూఁవు దక్కఁ బలుపోకలఁ బోవుచునుండు దేవుఁడున్। దాంచినసొమ్ముచేరె నకటా మఱిఁగోరని సత్యభామకున్। నోంచిన వారిసొమ్ము లవి నోమనివారికి వచ్చునే యిలన్'', ''ఘంటాకర్ణుఁడు నేను నా

యనుజుఁడీ కాలాంతకుఁడేము—మిక్కుటంబగు...జంపఁగ్ ... వేఁటంబోయితి మేని' అని. ఇందు, ఏచుశబ్దమున నరసున్న యీ యర్థమున లేదు; వేఁట యనుటకు వెంటపడుట రూపాంతరము స్థలాంతరమున వెనుకఁబేదు. భీమకవి నృసింహపురాణమున, "పాండవులనఁబల్ల సిద్ధిజనపల్లవులఁదోర్చిన రాజభీముఁడై। యాంధ్రపనుగానపుండ వృషభాంతకముపెట్టి కొనంగఁ జూచితో। నేంచిపెనేమి నీవనుచు నెచ్చెలులెల్ల హసింప నంతకో। మూంపపకంబిరోడి దొరమూర్తి వహించిన మ్రొక్కిరంగనల్" అని చెప్పియున్నది కావుననే శ్రీనాథునివంటివారును నర్థభేదప్రాసమును సడలనీయక ప్రయోగించిరి. నన్నయాదులు నిర్బిందువు నర్థబిందువును గలపిరని యప్పకవ్యాదులు చూపిన ప్రయోగములన్నియు వారి యల్పజ్ఞానము సూచించుచున్నది. అప్పకవియు, కూచిమంచి తిమ్మకవియు నుదాహరించిన పద్యములన్నియు లక్షణసారసంగ్రహ, కవిసంజీవని, కవి చింతామణి, లక్షణశిరోమణులు—వీనిలోనే యున్నవి. చీకటి, వీపు, శబ్దములలో నరసున్న లేదు. ఉన్నట్లు ప్రామాణిక కవులలోఁ బ్రయోగములు లేవు. కవిత్రయ, నాచనసోమన, నన్నెచోళ, కవిభల్లట, విన్నకోట పెద్దన, శ్రీనాథ. కేతనలు, ప్రాససంకరము చేసినవారు కారు. చీకటిశబ్దమునకు భారత దశ కుమార చరిత్రలలోని ప్రయోగములు చూచితిని. వీపుశబ్దమునకు నాదిపర్వము లోని ప్రయోగముగాక 'వీపుననబ్ధి నొక్క వృథివీధరమున్ దగఁదాల్చెనంచు లక్ష్మీపతి' అని నృసింహ - ఆ-౪-౧౪౦ లోను, 'వీపునమోపెఁ గచ్ఛపము పెంపిభుజంగమరాజు మస్తకస్థాపితఁజేసె నీవు వసుధారమణిం వెనుకోమటీంద్ర బాహాపరిరంభగుంభ సముదంచితఁ జేయుటయింత యొప్పునే మోపరులేమెఱుం గుదురు ముగ్ధలతోడి విహారధర్మముల్' అనియు నెఱ్ఱాప్రెగ్గడ ప్రయోగించి యున్నాఁడు. తీగ, శబ్దములో నరసున్న లేదు. 'డాగు' అనుపదము నెగయు నను నర్థమున నరసున్న లేదు. మూగుశబ్దమునకు రెండురూపములు ద్రవిడ కర్ణాట భాషలలోఁగూడఁ గలవు. బాగుశబ్దము ప్రాచీన నవీనరూపములు రెండు. ప్రాచీనరూపములో నరసున్న గలదు. 'యాంగువాళ్లు యిర్కళు మప్పులుపింగళుం। బాంగు బమ్మణ్ణిట్టర్ పచ్చలసగుత్తు' అని మనసోల్లాసల-ఆ-ఉ. ౧౮౯. ఇందు 'బాఁగు' అనఁ బ్రకాశము. కావునఁ బైపదముల నుంచుకొని యప్పకవి, ముద్దరాజు రామన, కస్తూరి రంగకవి, గణపవరపు వేంకటకవి, తిమ్మకవి—వీర లుదాహరించిన సంకరప్రాసములు శోధించినయెడల వీరి పాండిత్యమే సంకరమని తోచును. ఆఁగు-ఇత్యాది గకారములమున్న అర్థ

బిందుపు గలదా లేదా యను సంశయము, ‘గ’ కారము, ‘వ’ కారమైనచో లేదు. గాకున్న నున్నట్లూహింపవలయు. మూగుశబ్దము మూపు అనురూపమును బొందు చున్నది. చూడుండు కుమారసంభవములో ఇటువంటి పద్యములో శబ్దాలంకారము. మఱియు శాసనములలో ‘నాండు’ అనియే యున్నది. కావునఁ బూర్వకాలమున దీర్ఘముమీఁద నెలయున్నయే వాడినట్లు తోచుచున్నది. నాడు శబ్దమున ‘అనాడు, నేడు, ఎన్నడు’ అను నర్థమున మాత్రమే యర్ధానుస్వారము గలదు. ‘నాడు’ దిన మనునప్పుడు లేదు. ‘రెండవనాడు’ యనునప్పుడు లేదు. ద్రవిడభాషలో అంద్రి, ఇంద్రి, ఏంద్రు, అన్నినాఁడు, నేఁడు, ఎన్నఁడు అనియు, రెండు నాళ్ అని రెండునాళులు అనియు వేఱువేఱు పదములు గలవు. కావున నుద్యోగ పర్వములోఁ దిక్కన సంకరముచేసినవాఁడు కాఁడు. ‘క్రౌంచపద, సరసిజ, గర్భబంధ కవితల లక్షణములలోఁ బెద్దలుచెప్పిన యప్పకవ్యాదుల లక్షణ సూత్రములు ప్రామాణికముగా గ్రహించుట దోషము. ఇప్పుడు ప్రాచీన నవీన కావ్యములు వెలువడుచున్నవి. పరిశీలించి చూడఁదగును. నన్నెచోడుడు, ఏనియను శబ్దమును నేనియని నకారాదిగాఁగూడఁ బ్రయోగించెను. కాబట్టియే నన్నయభట్టు–న్నేని...విగ్రహపేరపెంపును, అవి–అ–ఉ. అను నకారాదిగాఁ బ్రయోగించె. ఇది తెలియక లాక్షణికులు దుస్సంధియు, యతికై వైకల్పిక భావమును నన్నయభట్టున కారోపించిరి. ఈ పైని శబ్దప్రయోగములు పరమ ప్రామాణికములై కవిత్రయ పెద్దన సోమన తేరన మంచనాదుల ప్రయోగము లకు సరిపోవుచున్నది.

## ఉత్తరకథా ప్రశంస

అష్టమాశ్వాసమునఁ బార్వతీ వర్ణనమును, శివుని ప్రస్థానమును, పౌరస్త్రీ దర్శనమును, బ్రహ్మాదుల వర్ణనమును, సాయంకాల వర్ణనమును, తమోవిజృంభణమును, చంద్రోదయ వర్ణనంబును, విటాభిసారికా వర్ణనంబు, లంజికాప్రసాధనంబును, పాంచాలాది విదర్శనంబును, సూర్యోదయంబును, వివాహయత్నంబును; నవమాశ్వాసమున శివపార్వతీ ప్రసాధనంబును, వివాహంబును, ఉద్యానవనవిహారంబును, జలక్రీడయును, కైలాస నిర్గమంబును, రతిక్రీడా విహారంబును; దశమాశ్వాసమున నగ్ని దేవతల ప్రేరణంబున వచ్చి శంభు వీర్యతప్తుఁడగుటయు, గంగ కొసంగుటయు, గంగాదేవి వల దనుటయు, శర

మణిసరోవరంబు వెదకుటయు, సప్తర్షి పత్నీదర్శనంబును, నరుంధతి పరిధానము ధరించుటయు, తక్కిన యాఱ్వురు నిరంబరలై యగ్నిచే నాలింగితలగుటయు, సద్యోగర్భము దాల్చుటయు, గర్భవిచ్ఛేదము నేసి కమలపత్రంబులం దిడి గృహమునకుం జని శప్తలై జ్యోతిర్లోకంబు నెందుట, కమలపత్రంబునఁ గుమారుం డుదయించుటయు, నారదాగమనంబును, ఇంద్రసందేశమును, ఐరావత కుమారయుద్ధంబును, ఇంద్రధాపనంబును, శివదర్శనంబును, పార్వతి వాత్సల్యంబును, కుమారుని సేనాపతిత్వంబును; ఏకాదశాశ్వాసమున తారకునకు దూతం బుచ్చుటయుఁ బ్రాతిమాత్యంబును, యుద్ధ సన్నాహంబును, వీరపత్నీ ప్రవాస దుఃఖంబును, దివసద్వయ యుద్ధంబును; ద్వాదశాశ్వాసమ్మున తృతీయ దివసయుద్ధమ్మున తారక మరణంబును, దివ్యాంగనా శేషాక్షతా వర్షణంబును, గ్రంథకర్తృ కవితోద్దేశమును వర్ణింపఁ బడినవి.

దీనిలో నాశ్వాసాద్యంత పద్యములలోఁ గృతిపతియగు మల్లికార్జునకును శివునకు నభేదము సేయఁబడినది. ఈ మర్యాద కర్ణాటభాషలో పంప భారతము లోను గదాయుద్ధము నందును గూడఁగలదు. గ్రంథాంతమునను "సరసాహారము రాగ హేతువను టజ్ఞానంబు పారావతో। త్కరముల్ చిక్కనిరాలు మ్రింగియు సదాకామార్తులై యుండుఁగే। నరి సాంద్రామిషభుక్తియైనను సకృత్సంభోగ మంచున్ మనో। హరసుజ్ఞానము కాక రాగరస మం దాహారనిర్వృత్తియే.

సీ॥ బుద్ధీంద్రియంబుల పొలఁతులనాఁడాలు
కర్మేంద్రియంబుల గర్వమడఁచి
విషయాలి నదపెడు వివేకలనఁజాలు
బుద్ధీంద్రియంబుల పొంకమడఁచి
యంతఃకరణతతి నాటపట్టనఁజాలు
విషయ సమూహంబు వీకుడఁచి
యాజవంజవమున కనుచారియై పర్వు
నంతఃకరణతతి నలవుమడఁచి

బహువిధస్థూలముల్ బాహ్యకరణసమితి
సూక్ష్మమంతః కరణతఁ జొచ్చికూడు
నాత్మనాత్మైకవృత్తి సర్వాత్మఁ బరమ
పదనిరూఢి గాంచుట పరమపదవి సుమ్ము" అనిచెప్పి,

సీ॥ "జ్ఞాన దీపంబు హృత్సదనంబులోఁ దాన
దీపియగానెంతదిప్పరువారు
వలచేత పసుపుపేపంచయంబు నవరత్న
పటపంబుగా నిడపంచువారు
భారతిఁదమమోముఁబసిఁడి మాడువులోన
నిలువేల్పుగానిల్పఁ దలఁచువారు
నవమాదిగుణమణీహారమ్ము లురమున
హారమ్ముగానిడఁ గోరువారు

వెలయమత్కృతిఁ జదువఁ బఠింపఁ ద్రాయఁ
దీశ్వరాంబికాగుహు లిష్టరీప్సితములు
వారిమేమెయిఁ గొనియాడువారుకోర్కె
లొనర జంగమ మల్లికార్జునుఁడనైనఁగు" అనియు వ్రాసియున్నాఁడు.

దీనికంటెను మనోహరమైనకావ్యము పెద్దనప్రద్యుమ్న చరిత్రము, చిమ్మపూఁడి యమరేశ్వరుని విక్రమసేనము నాచనసోముని కవిత కీడురాదు. వెమ్మన యనిరుద్ధచరిత్రము భావ గాంభీర్యము పదప్రౌఢియుఁగలదై యతిరమ్యముగానున్నది. ఈ మూఁటితో భాగములు మాత్రమే లభించినందున నాంధ్రభాషాభిమాను లెవ్వరేని నాకుఁబ్రత్యంతరములు పంపిన వాని ముద్రించి మాసిపోవుచున్న తత్కవుల కీర్తిచంద్రిక బిల్లసిల్లునట్లు చేసెదను.

ఈ గ్రంథమును సంపాదించి ప్రచురించుటకై నా చేసిన దేహధనవ్యయములును మిక్కిలియయ్యె. గార్యాంతర ప్రసక్తుండ నగు నాకు నవకాశము లేమింజేసి గ్రంథశోధనము చక్కఁగాఁజేయక కొన్ని ప్రమాదములు విడచితిని. ప్రాచీనపదములలోఁ గూడ నెక్కువ జ్ఞానములేమిచేఁ గొన్నియెడలు సందిగ్ధములుగా నుండును. పాండిత్యము చాలక యిట్టిపనికిఁ బూనినందునకు నన్ను నిందింపక నాసదుద్దేశమును మాత్రమే గ్రహించి నాయందు మిత్రభావము ప్రకటింతురని యీకృతిఁజదువు వారినెల్లరను మిక్కిలి విధేయతతోఁ ప్రార్థించుచున్నాఁడను.

పనపర్తి—
డిసెంబరు ౨౮ తేది-౧౯౦౮ } మా-రామకృష్ణకవి.

# ప్రథమభాగము—అనుబంధము

ఇంపుతో సంఖ్య గ్రంథమునందలి పద్య సంఖ్యను దెలుపును.

9. ఇంపు॰ప్రాసమున దీర్ఘముమీఁది యరసున్న నెఱసున్నగా వాడఁబడినది. ఈ విషయమై పీఠికలోఁ జూడుఁడు. విష్ణువు మహేశ్వరుని వామాంగమునందు ఉండెనని చోళుఁడన్నను మఱియొక కవి దక్షిణాంగమని చెప్పుచున్నాఁడు. 'బంట్లున్న పాలెంబ బలువిల్లుగాఁజేసి నవమణివలయంబు నారిఁజేసి । సుమనసెన్నడిమి కన్నును ములికిగాఁ జేసి దక్షిణాంగంబ యస్త్రమ్ముజేసి' అని పేరయ మల్లికార్జున శతకము. బొడ్డపాటి కొండయ తన కాళహస్తి శతకములో వామాంగమనియే చెప్పెను. 'ఊర్వులశ్వంబులై యొప్పారుచుండంగ దొరయుపల్లెరము సూతుండుగాఁగ । సవ్యాంగమతిఘోర సాయకంబడిగాఁగ సౌరిదిఁగుంతలము మైజోడుగాఁగ' 6. అనయము = మిక్కిలి 9. స్థాణువు = మొఱడు. అపర్ణా = ఆకులులేనిది. విశాఖ = కొమ్మలులేని 11. ఎలయు = ప్రసన్నముగు. 12. సద్యము = అప్పుడ. 'సద్యంబ బ్రహ్మహత్యావద్యము' భార-స్వ. 17. వాల్మీకున్ — 'వాల్మీకిశ్చాపి వాల్మీకోవలటావరటాతథా' ద్విరూపకోశము. 22. మహారవిజాణుని కరములు తునుమంబడి శివప్రసాదముచేఁ గ్రమ్మఱలభించినట్లు కవిస్తోత్రముల వలనఁ దెలియుచున్నదిగాని యెంతవఱకు నిజమో తెలియదు. బాణాసురుని విషయముగా నప్రస్తుతశ్లేషమున గ్రహించినచో సరసముగానుండును. 'గద్యంబు చెప్పి శంకరునిచేఁ గరములు ప్రతిభతోఁ బడిసిన బాణుఁడలఁచి । హరునివినుతులచే బాసలాడఁజేసినట్టి భట్టుని నన్నయ భట్టుఁ బొగడి' అమరేశ్వరుని విక్రమసేనము.

21. ఉద్భటుఁడు కుమారసంభవము, కావ్యాలంకార సారసంగ్రహము, హరలీలయుఁజెప్పినవాఁడు. కాశ్మీరజయాపీడుని సంస్థానమున నుండినవాడు. 35. ప్రాణములు = దశప్రాణములు. 36. మేలిల్లు = శ్రేష్ఠమగు సదన్న (ధాతువదము) 38. గ్రుడ్డివాఁడు లావుకపక్షినిఁ ద్రొక్కినట్లు = ఘుణాక్షర న్యాయముగ. పోల్చిచూడుఁడు 'జీయెనె బల్లవర్ నెఱయె సత్కృలిపేకదెవేళ్ ఘుణాక్షర । ప్రాయదెశద్ధమొందెరడు మత్తెవిచారిసినోడె కాకతాళీయదె వాక్యమొందె

రము కూడె నిపుణత వా రంభలావుక। న్యాయపడె భావ మెంచెరమలేసెనె పేర్వుఁజెర్పు దొప్పమే' చంద్రప్రభ పురాణం-౪-౧-౪౮. 40. పొల్చి చూచుఁడు. 'పదలాలిత్యము వర్ణనస్థైర్యము శబ్దస్థైర్యమున్ మంగళా। స్పుర భావంబును రాజ యోగ్యతయు దోషస్ఫూర్తి రాహిత్యమున్। సదలంకార విశే షముం గలిగి విశ్వప్రాణ సౌభాగ్యసం। పదమైఁ దేశభాషలఁబోల్చిరాల పంచా పద్యంబు హృద్యస్థితిన్' అని కవిలోక బ్రహ్మ.

72. మైకొన్న = ఇష్టపడిన యెడల. 74. జీవితేశ్వరుఁడు = భర్తుఁడు. అపోవక = తనివిలేక. 82. ఉలివి = మ్రోఁత. అలించి విని = ఆదరించి విని. ('అక్కొమ్మమధురోక్తు లాలించి యెన్నఁడు పీసుల విన సంభవించునొకొ' ఉద-౪-౧-౧౭౧). 89. వెల్చన్ = తెల్లనగునట్లు. 90. సోలయుటన్ = మత్తుతో. 92. పులుపులు = పశువులు. 94. ముసుమిడి = పదునా. 95. సావి = యని. 98. కదివోవ = చెడ్డవానన పోవునట్లు. కాతరిల్లి = ఉత్సహించి. 'బగ సంభోగసుఖక్కై కాతరిసి కణ్ణళ్ కీరి సర్వాంగమం తెగ వాలింగిసె' పంపరామా-౯-౨౯౭. 102 కన్నెటింగి = జాదవెలిసి. 105 ఒకమెయి = కామరూపశక్తి లేని యొక దేహముతో. 126 గో = కిరణములు. 160 కన గోల = కళ. కోల = బాణము. గరి = ఈక. (విష్ణువు బాణమై యగ్ని నాభా గ్రముగాఁ ద్రిపురవిజయమునఁ బరిణమించెననుటను, 'వింటి క్రిందయికొమ్మ వెకలించి పెటికిన భూకాంతయును నాభి పొలువు మిగిలె। నమ్ము వుచ్చుకొనిన నవితరంగముల్ పాలసంద్రంబునఁ బ్రవిస్తరిల్లెఁబాయుసరంపులు రెండు సంస్త్రీ గిలించెనఁ గలువలుఁ దామరల్ సెలిమిసేసె। వాజుంఁ గొనివచ్చి వరరథం బునఁ బూన్పఁ జిచ్చుకు నాకలిచిచ్చు పుట్టె। నారి సంధింపఁ గర్వపనారి పడఁకెఁ। గోల సంధించ లచ్చికి గోలవుట్టె। విల్లు దెగఁడాపెఁ బురములు ద్రెక్కనేసి। తరిదివిలుకాఁడ వౌదువ శరభలింగ' అని పాలపర్తి సోమేశ్వరుఁడు 'నుదుటి నెన్నడిమికన్నును ముల్కిగాఁ జేసి దక్షిణాంగంబ యస్త్రముగఁ జేసి.' 'గరితోడఁ గూడ నాకసపు సూపికె లాగు నెమ్మేనఁ బద నిచ్చునమ్మ దాపెగి' పేరయమల్లికార్జున శతకములోని చిన్నపద్య పాదములు.

163 అన్నిన = ప్రవేశించిన. 164 పరవిడి = వాచాటుఁడు. దాఁకె = దిగి. తుత్తుబుగొని = గొంతు కట్టుకొని. 188 ఎత్తు = దండెత్తు. 189 విగు

ర్పించి = భయము చూపి. 'వారిధిమేరెదప్పి కవిసంతు విగుర్పించిరేఁ దశాననం' సంపరామా-ఁా-౧౮౭. 194 దంపము = ఆవశ్యకము. 198 చీకటి—అర సున్న లేసందుటను 'నీకరంబులు ద్రోపక చీకటించుసు' భార-అను-ఆ-౪. 'నా పాతుఁబొజుఁగు పిసుకు నృపా కటువిట...నాతం। డేకతము—।చీకటి నొకనాఁడు దెచ్చి చెచ్చెర నిచ్చెన్' దశ-ఆ-ఒ-ఁా. 207 తేహాఁగు = ఉపాయము.

210 కవి = ఆక్రమణము. 212 పంపం = వుట్టి 'పందలె మో? దోర ణద గీంపపరం పొసఘాసు ఘాపకూసంపరె' అర్థ నేమిపురాణము, 'సత్తిగెగగ్గ రంకరుళ బక్కఁశె మంపట కణ్ణక్షెసరం। సుత్తిద పాళయక్కె పిదుసూంటుగె పంద లెయొందు' గుణవర్మని శూద్రకము. యెత్తిరి = పేయుపంచిరి. 219 కావ డించి = క్రొప్పఁబునట్టు. 221 కడిసన్న = వాసనపోయిన. 229 కానువు = కానుగు.

234. చరులు = చప్పటలు. గెత్తుచు = ఊఁగుచు. 235. అపూర్వ పదములకుఁ బ్రయోగంబులు మృగ్యంబులు. 247 శివహిమవంతులకు శ్లేష. 251 కీడు = తక్కువ. 253 పట్టొటి = ప్రవాహము. 259 వుటరు = లక్ష్యము సేయుట. 'ఉటడు సురేంద్రునైన.' భార. ఆది. రేయెండ = బాలాతపము. 'కటి వచ్చపట్టు దిగ్దంతి కుంభస్థలి చూపట్టు రేయెండ జోడు జోడు' ఉ-హరి-ఆ-౪. 268 తార = వెండి. 281 అంకమాలిక = నామాంకితస్తుతులు. "ఇనియనమేలె మెల్లనమలంగి మనంగొళె భంగియిందె సం। జనితవికార మొప్పె నిజసౌష్ఠవమొందిరె బీగి పీవర। స్తనయుగమధ్యదొళ్ కరమొడంబడె జీవెయనుణ్బ ఫలమే। లెనిసె పపాటి పాడిమెఱదళ్ నయదిం ప్రియనంక మాలెయం" కవికాముని శృంగార రత్నాకరం. ఆ. ౧ ౪౨. పత్రచ్ఛేదము = కలావిశేషము. 283 మలఁవగ = పుష్పింప. 297 రాజశేఖరుని పూర్ణచాటువు = "కర్ణాటీ దశనాంకితః స్మితమహారాష్ట్రీ కటాక్షాహతః ప్రౌఢాంధ్రీ స్తనపీడితః ప్రణయినీ భ్రూభంగవిత్రాసితః లాటీ బాహువివేష్టితశ్చ మలయస్త్రీతర్జనీతర్జితః సోయం సంప్రతి రాజశేఖరకవిర్వారాణసీం వాంఛతి". 305. తొప్ప = ఎట్టిదైన. "తొప్పవాతెఱ" వీధి. ౨౦౩. 315. తిరులు = వెట్టి. 319. సురంగము = ఒప్పిదము. 320 ముంచితెచ్చి = అంతయుఁదెచ్చి. "కుంచకరావళి ముంచి తెచ్చి" కేయూ-ఆ-౪. ౩౪. 345. వరువు = దాస్యవు. 351 పసిగొని =

ఆఁకలిగొని. ఏఁగిలింపకుండ = జేకులు విప్పకుండ. ఎరలి = ఆలింగనోష్ణ భావమును బొంది. 359 అనయము = మిక్కిలి. 361 అబ్బగించు = ఓర్చు. 371 పలుపలు = నిరంకుశుఁ డగు. అబ్జుఁడు = చంద్రుఁడు. మొగపెట్టు = ఎదిరించు 372 ఓఁగులవాఁడు = యుద్ధమునఁ బాఱువానికి శిక్షఁయిచ్చి తక్కిన వారి నెదుటఁగొంపోయి భంగము చూపుట. 373 అర్క = జిల్లెడు. 374. వెలిలోఁపు = అంతర్బహిస్సులు = న్యాయాన్యాయములు. 375 ఈడపెడుచు = కాపాడక విడుచు. 379 బంధఁగి = దీమము. త్రోచి = అవ్వలఁ ద్రోసి. 381 ఒరయుగడ = Competition. 332 దీర్ఘనిద్ర = చావు. 383 ఆర = అంగారకుఁడు. మంద = శని. 384 అనిమిష = చేఁపలు. భీమ అరుతము. కనక = ఉమ్మెత. శివ = నక్క. 336 శుక్లశోణితము౦ రెంటికిని వీర్య మనఁజను. 392. విరలి = విరాళి. 394 అప్సరస = ఆకారాంతము గూడఁ గలదు. 396 ఎచ్చి = పొగడి. 398 తిరులు = వెట్టి. 399 వేల = దాస్యము. కలుచు = ప్రేమించు. 400 అగ్గలము = మించినవారు. 401 తన్ను = నన్ను. ఇట్టిప్రయోగములు ప్రాచీనకవులలోఁ గలవు. "ఒలసి మాముందఱ నొక పైఁడి మృగము। వొలయుటయును జూచి భూనాథుఁజూచి దాని నేగతినైనఁ దనకుఁ దెమ్మనినఁ బూని రాముఁడువోయె...నార్తరవంబు కూలమై నాచెవిఁ జొచ్చి నాటుటయు" రంగ-అరణ్య. "చెప్పకున్న నీవు జీవంబు విడుతువు చెప్పినపుడు తనకు జీవహాని। చెప్పి మున్న నీకు జీవంబు విడిచెద। నీవు చన్నవిదప నిలువ లేను", "అక్కన్యఁదెచ్చి। పెండ్లిసేయుము తన్ను నభీష్టమిదియ। యనిన నగుఁగాక యనుచు ధరాధిపుండు" కవిభల్లటుని భేతాళపంచవింశతి.

411 వార్చుచు = ఎదురు నూచుచు. 414. కుసుకుసకొను = అస్ఫుట వాక్కు లాడుచు. 415 కండవడము = తెఱ. "కండవడం తెరసీరెనీర్జలం" కబ్బిగరకైపిడి. "తళిర్గళకండవడంగళ। తళిర్గళపానుగళె తళిర్గళోవరిగళెకెం దళిర్గళె ళసిపెళవిజిల్గళె। విలాసనుంమె తెద రల్లికెల రబలెయరొళ్" ఆది పురాణం. ఆ-౧౧. ౭౯. కదుపటిల్లు = వడఁకు. 416 ఉదరిపడి = ఉలికిపడి. తెంక = సందేహము. నోటికండ = భయము. 418 ప్రహసికాఁడు = ఉద్యోగి. పోఁటరిమాఁట = పొసఁగుటలో నేర్పరి. ఎల్లిసుండు = హేళితుండు, 426 బూటగొంగ = విటుఁడు. 432 అలఁతి = మితి = శక్తి. 436 కొసరు = మఱి మఱిఁ బ్రార్థించు.

రేఖలు వ్రాయు పంచమార్గములలో నొకటి—తక్కినవి:— అర్ధఋజువు, సాచి, ద్వ్యర్ధాక్షి, పార్శ్వాగతము. చిత్రపటరూపములు మనలఁ జూచుదృష్టిభేదములఁ జూపురేఖలే యీమార్గములు. పోల్చుమాడుఁడు "కిరి ఋజ్వాగతదింద మర్ధఋజువింపం కోకిలం సాచియుం। కలహంసికలభం రథాంగమిథునం ద్వ్యర్ధాక్షియిం బర్హిమం। దలి పార్శ్వాగతదిం దదేంపడెదవో పంచాంతరవ్యక్తిక। ణ్గొళె కందర్పనబాణపంచకదవోల్ చిత్రకృతిశోభమం" అని మల్లినాథపురాణములోని చిత్రపటవర్ణనము. పత్రక, బిందుక, నిమ్నోన్నత, మాన, నీలక, ధూమ్రావర్తక, ఉద్వర్తన, చిత్రప్రవర్తనము లను నెనిమిదియు క్రమముగా సకల, స్వస్తిక, సర్వతోభద్ర, కటక, కంటక, ప్రభంగ, విపనివేశ్షణ, వర్ధమానములను నెనిమిది విధములగు చిత్రరూపములను రేఖనమార్గములు. వన్నియ = వర్ణము. కంజెఱ = గవిసెన, కప్పుపావడ. 600 మెయి = రీతి. చలిమిరి = శైత్యము. గిర్కొను = అపహరించు. 601. ఆగతు = అగుట. కలసికొని = చేర్చికొని. "బాలచంద్రికం గలసికొని తక్కుఁజికెయుం పంచించి" వర. ఆ ౩. 605 కప్పివల్కు = మఱుఁగుసేయు. బయల్పుడ = స్పష్టముగునట్లు. 606 వంటసము = అనురాగము. కుక్కుడము = తొలుగునట్లునిందుట. 611 లగ్గ బెగ్గళి = "లగ్గ బెగ్గలించు నగ్గలముగ" భార—విరా—ఆ—౨. 613 అదుఱు = కెంపు; సూర్యుఁడు. చేలరింప = సమృష్టిపనము గలుగ నమృతమున కిట్టి గుణము గలదుకదా. పలను = యుక్తిమార్గము. 616 తోడుతాముల = కలువ కాఁడలు. 618 గంటులు = వేస్కు. కుదవ = గిల్లుము, కొలపేసలు = పట్టిపేస్కు. "తపనీయ రావిలాసకుసుమాస్త్రనిక్షిప్త కామతాపదిం। తనుజన్మృణాళమం తెగెమ పూగొళదిం పొఱగిక్కిసంపదిం। కొరగిమృణాళనాళికెగెచందన దక్కెగె తణ్ణుకెగ్గెత। జ్ఞరగద నూపుర్గె కొలపేక్ గౌవలం గుణియూనె మాడువర్" మల్లి. ఆ—౩. ౨౮. పదిపెట్టు = నీవ వదిఁయునట్లు పెట్టుము. 624 వాసించి = వాసనయు కూర్చి. "నీహారజలముల నింపారుకుంభలు శీరగంధముల వాసించువారు" వర—ఆ౩—౨౨. వాటి = పోఁగొట్టి. ఎంమి = ఒత్తి. 627 పాటించి = మృదుత్వమున కనుకూలముగాఁగూర్చి: "పూవుసెజ్జంపు లేఁబొంఁలపీచోపులు వెరవుపాటించి గాపించువారు" వర—ఆ—౩. 628 పలిపు = శైత్యము. 634 వఱువట్టు = పిక్కిలియొండి వాహము గలుగుట. కొలగొను = చంపు. వగలు = పిందలు, కోరికలు. 635 రేకలు = రాత్రి ప్రారంభమున. "కాలము తలఁజేడ" రేయూ. ఆ—౩. నక్షు = పిపుసు. 641 కసి = తీట. పిడిగొల్చి =

విప్పి. తని = చల్లని, అఱిమి = గొంతురాపడి. ఎలనుగ్గు = సన్నపొడి. 662 ఇడుగడ = ఆపద. 670 దేహమును దవనపుఁబొరకుఁ బోల్చుటకు, ''పరిణత ఫణిలతాపత్రంబు గడిసినచిపురునాఁ జెక్కుఁ జేయిచేర్చి। దవనంబుపొరకలఁ గవిసినమంచునాఁ బలుచనిచెమట మైఁ గలసి మెఱయఁ। గలువరేకులు మౌక్తి కముల సీసెడిని నాఁ గన్నుల బాష్పాంబుకణము లురుల...యేకతం బున్నదాని రాజేంద్రతనయఁ గనిరి లతికాగృహంబులో వనజముఖులు" అమరేశ్వరువిక్రమ సేనము. నెలకన్ను = చంద్రదర్శనము. 672 ఆలవు = స్త్రీవి. 674 వేల = దాస్యము. సంబవులు = కప్పములు. గోలికొలిపి = వెట్టిఁజేసి. 676 వెందు = తమవశమునకుఁ దెచ్చుటకై భ్రమరములు మధ్యనుంచిపాడెడుపురుగు. 682 ఘోషావతి = పార్వతివీణకుఁ బేరు. 684 కూర్చుగుమ్మలు = ప్రియమైన చెలిమి కత్తెలు. 687 అలఁతికి = మితికి. పొదివెంచు = ప్రతిపెచ్చు. మరపెంచి = స్నేహముచే మరిగియుండునట్లుచేసి. అనఁగి = కలసి. అఱఁగ = పోవునట్లు. విడిచెదేని = విడిచినను విడుతుపుగాక. 692 వేరుపెల్లంకి = వేఖ్నగడ్డలు. "వేరువెల్లఁకి గాయగూర సంపసికోర కుదరాగ్నిగాడ్పుచే నుజ్జగించి" పాండు. ఆ-౨-౨౯. "అడవిలో వెల్వలనై వేరువెల్లంకి త్రవ్వి తాఁదినెడు భూదార పపుని" అనర్ఘ—ఆ. ౧. 694 పోల్చిచూడుఁడు:— ఉత్తరహరివంశము—ఆ-౨-౧౨౨వ పద్యము. 701కాఁదపూవులు = వనపుష్పవిశేషము.ఇది వర్షర్తువునఁ బుష్పించును."ముగిలిదిరేఁతె కాదలలరేఁతె" జగన్నాథవిజయము. 702అన్ని = మదించి. గౌఁడుగీతములు = కల్లు దింపెడివారి పాటలు. 704 గోలము = కుదురులు. గౌరుకొమ్ము = ఏనుఁగుకొమ్ముతోఁ జేసినవి. 704 మల్లికార్జునుఁడు-కృతిపతి శివున కభేదముగాఁజెప్పఁబడినది. 707 వెంచ = సరస్సు. ''వికచ సరసీరుహం కోకకులవ్యాభాసి పూగోళం తానిరెయుం బకనికరలులితకలుషోదక విడిళదొ ళంచె వెంచెయొకె వసియిసుమే'' గుణవర్మ శూద్రకము. 709 వలి = గుండ్రపు 741. తొప్ప = ఎట్టినగు. (తొప్పవాతెఱయునుదొ్రటుపాటు. నిర్వ-ఆ-౮.) 803 ఎయిద = సమీపింపఁజేయ. 803 అగ్నిసహియగు రస మష్టలోహ ములను వేధించును.

రసముశుద్ధిచేసి హేమవజ్రాదిసత్త్వ ద్రుతులలో రసజారణముసేసి ఘూమవేధిశబ్దవేధియగు రసముగాఁజేసి సారణనియతితప్పక యేలోహములలో వేధించినను హేమమగును. ఈ యంశములకుఁ చూడుఁడు రసరత్నాకరము

పాపఘంసము, రసార్ణవము, మంథానభైరవకల్పము, ఖండకాపాలికతంత్రము, రససారము, స్థిరరసమంజరి, కల్యాణకారకము మొదలగు రసశాస్త్రములు. 804 సారి = చక్రము. 806 అరగొను = సందేహించు. అలికిరి = చల్లిరి. 812 ఉప్పరి = ఉప్పుగా పంచలివడి. 819 దెచ్చుడు = తెచ్చుట, నానోడి = చెప్పుటకుభయపడి. కన్ను = జాడ. 821 కాన్కి = చూపు. కావుడు = అగుట. 825 పోలుపొందు = సమరియుండునట్లు. 838 తొడుప = తొడిగింప. త్రేణి = మినమినలాడుట. ఈదపెడుచు = ఊరకవిడుచు. 844 ఈ పద్యార్థము కాళిదాసు కుమారసంభవములోనుండి గ్రహింపఁబడినది. 846 తగిలించి = ప్రేమింపజేసి. సొబగుఁడు = సుభగుఁడు. "సొబగులునీమగలేవురు" భార—ఆర. 850 కుదురు = ఆలవాలము. నఱుము = వికటవు. 855 అష్టమూర్తులు శివునకుఁగలవు గదా. 858 తక్కనేలిన = తానేపాలించిన. అపదార్థుఁడు = వస్తురూపములేని వాఁడు, అవాచ్యుఁడు. 859 నో = నొచ్చునట్లు. 862 బీరగాఁడు = తేజోవంతుని. సెప్పుడు = చెప్పుట. 865 ఊఁపరలు = పరోక్షమున నిందించుటలు. 867 పొడి = ఒడ్డి. పోల్చిచూడుఁడు దశకుమారచరిత. ఆ—౬—౯౬. 868 వసిమి = సౌభాగ్యము. 869. అన్నింతియ—"అన్నిష్టసఖియూఁదియున్నదాని" భార-ఆది. పులి = పల్లని. నగ్నము = దిగంబరత్వము. చెట్లపురులు = ఆశ్చర్యములపట్టు. 870 కుడుపుట్టు = భోజనపాత్ర. గుడిసుడి = స్మశానము. వలువు = వస్త్రము. బడరుఁడు = దరిద్రుఁడు. 871 చెప్పు = చెప్పెడుమాట. 872 ఎడలించియు = పోఁగొట్టియు. 874 కొఱఁగఁడు = నీచుఁడు. ఓచెల్ల = బాపురె. కనుడు = కనుట. 880 కొఱడు = స్థాణువు. "బలుగొఱడు వోలె నెండకుఁ। బలికెని వానకును నోర్చి" పంచతంత్రి. 894 కావుడు = అగుట. 897 నోసిన = నొచ్చిన. వెలివిడుపు = గ్రహణమోక్షము. 901. వినిమీలిత దృష్టికని లోలదృష్టికని భారతీయము చూడుఁడు. 903 కల్లడి = పొంగు 946. పోల్చిచూడుఁడు:— "ఆపురి సున్నతస్ఫటికహర్మ్య విభాపటలంబునింగిను। ద్దీపితమైనఁజూచి యిది దివ్యతరంగిణి యెత్తివచ్చెఁదా। నీవయిత్రోవనంచు బయలీఁదుచుఁ గోయఁదలంతు రగ్రసం। స్థాపితహేమకుంభములు తామరలంచు వియచ్చరాంగనల్" పినవీరుశాకుంతలము—ఆ—౧.

943. "గండరించు" అనునది, "కండరించు" అని యుండవలయు. రాతిలో నాకారమేర్పఱచుట యని యర్థము. చూడుడు "శ్రీరామాపర్ణదిం కండర

సిద సతిపోల్ కౌస్తుభం మేఘసూనాహారంపోల్" గుణవర్మకుహ్రదకము. ఆ-౧-౧.

961. గట్టివాలు = గంధపుష్పములు సేయు లేక యున్నవాడు. గట్టి వాలితి-స్త్రీలింగము. "ఎలిమి=మెచ్చిన గట్టివాలితియన=" యనియే యెఱ్ఱ ప్రెగ్గడ ప్రయోగించియుండుసు. కన్నడమున :—గట్టివాల్తి యనినైరంధ్రికిఁ బేరు. "చందనగంధక్కం పదనేంపి వరపరిమళక్కె మెఱుగున భృంగబృంద మనుఱి సోవుత్తుం మందైసిమగుడ్చి గట్టివాల్తి యురెనసుం"॥ నేమినాథకల్యాణం ఆ-౨-౯౧. "పరిమళలోభదిం...... గట్టివాల్తియర్" మల్లినాథపురాణం ఆ-౧-౯౦. ఈ శబ్దవిషయమై సీతారామాచార్యులవారి యుత్పత్తియుఁబ్రయోగమును సరియైనవికావు. ప్రాచీనకవి ప్రయోగసారస్యము తెలియకయే పెక్కుల గ్రంథములు ముద్రితములయినవి, ఇదిశోచనీయము.

79. ఆపోవక— "రూపుగ మెయిఁగడచినచో నాపోవక వాయఁ జూడనగుఁగంసన్నృపా" మంచిభట్టు అశ్వశాస్త్రము.

164 హరి తన నేత్రములతో శివపాదార్చనము సేసి శివుని మెప్పించి యతనిచే సుదర్శనంబు వడసెనని కొమ్మన శివలీలావిలాసము ౧౩-వ లింలో నున్నది. జలంధరుఁడను రాక్షసుడు హరిని పప్పనకుం జిమ్మి బ్రహ్మాదుల జయించి దేవతలకు వెఱగొంగయై శివుం దలఁచి యుద్ధమునకుఁ బిలుచుటయు సముద్రవేలావనంబున విహరించుచున్నశివుఁడు సముద్రవునీటిని పలయాకారం బుగాఁ గాలివెన్నువ్రేలిచేఁ ద్రిప్పెను అది చక్రమయ్యెను సుదర్శనంబు కలిగినట్లు పై కృతిలో ౨వ ఆశ్వాసమున నున్నది.

202. అబ్బగింపక = ఓర్వజాలక. 252. కంపు = పుంపువాసన. "నీ ఆనక యమృతంబుఁ దానిట్టచవియని యనుం తేర్పఁబడఁగాఁ జాలువారు। చూడక మన్మథు సుందరాకారంబు గరిమఁ జూపఁగఁ జాలుదవకవారు। వినకయ పరతత్త్వవిపులనినాదంబు వినిపింపఁ జాలెడువారవువారు। నంటక మెఱుపుంబుసుం దంబు ప్రేఁగును గణుతింపఁ జాలు ప్రఖ్యాతివారు। కంపుగొనకయ కల్పవృక్ష ములపుష్పసౌరభం బిట్టి దని చెప్పఁజాలువారు। నెంచుఁజూచిన ధాత్రిలో హృదయ దృష్టిఁగవులుగాననిమర్మంబు గలదె జగతి.'' అని కేదనకావ్యంబని. 239. మేఘ డంబరము = ఆతపత్రము. "నుత్తిదపెంపవాన దెసెపెండిర రోలకటాక్షమా లెయం......మేఘడంబరద తణ్ణెళలోళ్'' మల్లినాథపురాణము, ఆ-౫-౯౪.

259. నామరు = పాచిక. 313. ఉప్పయనము. "లలితసరోజసౌరభములంగలయం జనిచూచి యెందు మెచ్చొలయమి నా పురాంగనల యొప్పెడు వక్త్రసరోజ గంధముల్। పలుమఱుఁగ్రోల సౌధములపై కలివర్గము లేఁగు దానసం। కలిత గజేంద్ర గండఫలకంబుల కుప్పయనంబు సేయుచున్." భట్టురాజు గౌరీకల్యాణము. 432—433. శివుఁడు శరభావతార మెత్తి మిక్కిలి తామస వృత్తితోఁ బ్రవర్తించుచున్న నరసింహునిఁజీరె నమకథయు బలి నోడించి తన విశ్వరూపంబు నుపసంహరింపక పెఁగుచున్న త్రివిక్రమదేవునినోర్చి యద్దేపుకంకాళంబు శివుఁడు ధరించినకథయు నిశ్శంకకొమ్మన శివలీలావిలాసమున క్రమముగా ౩౨-౩౪ వ లీలలలో వర్ణింపబడినవి.

473. అబ్జసూత్రగుణమనుటకు- "గొనయముతమ్మినూల్ చెఱకుఁగోల ధనుర్లత" విక్రమసేనము. ఆ-౧

496. ఓజవిడి మదము పట్టిన యాడయేనుఁగు."కచభారం కొరల్గబలెయ కచకుచభర మసియనడుగె కచకుచజఘనో । పచయభరం తొడెగగ్గె విచతురిందం మెట్టి తొర్వ్వళోజెయపెడియం" రన్నని యజితపురాణం-ఆ-౨-౪౨. 502 కాపువచ్చు ననుటకు మఱియుం బ్రయోగములు. "దీనిలోపలఁగొన్ని దినము లూనిన నుష్ణకరుఁడైన నటు శీతకరుఁడు గాఁడె। దీని లోఁతెఱిఁగిన దానంబురాశిలోఁగాదని జలశాయి కాపురాఁడె। దీని తియ్యనినీరు దివిజులు త్రావినఁ దమయమృతంబుఁ జేఁదనుచు ననరె" అని కేతనకాదంబరిలో నచ్ఛోద సరోవర్ణనము. మఱియు, "పల్లవపుష్ప సంపదలఁ బంచి వసంతుఁడు కాపురాకకై। యెల్లవనంబు సంకటము లేఁదఁగఁదా రొడికంబుమీఱ నట్లల్లన క్రోల్క్రోలి మలయానిలుఁడంచుఁ బురాణపత్రముల్। డుల్లఁగఁజేసె నత్క్రియఁ బటుత్వము కాముఁడు విచ్చలింపఁగన్." సోమయాజి విజయసేనము. 597 తిట్టంబు = చిత్రము వ్రాయమొదట నేర్పఱించుసీమ. "బరయ లెంచు బట్టిగె పలగె యంతరిసి తిట్టమిట్టు." ఆదిపురాణం-ఆ-౬-౭౬. 597. వన్నువ = వర్ణము వన్నువు-అని, "కెమ్మోవివన్నువూన్చి" అని మరల కవి ప్రయోగించెను. "కామితఫలము జక్కవలకు నొసఁగెడి సాంద్రపల్లవ పారిజాత మనఁగ। రంజిల్లఁ గెందామరలకు వన్నువపెట్టి నలువ గూర్చిన కెంపుఁగులిశమనఁగ" వన్నువునకు, "ధరణీజ సల్మలతావితానము పల్లవములకుఁ గట్టెఱ్ఱవన్ను వొసఁగి" అని ప్రాచీన కవి ప్రయోగములు గలవు. 670. రేమెండ = పాతాళపమే యనుటకు, "రేయి

వెన్నెల నాఁటి రేమెంత యుపయింప వెపవు చకోరంపుఁబిల్లలనఁగ'' వినవీరుని శాకుంతలము. ''కాముకకొంత పైఁ గాయు రేమెంపకుఁ జెలువైన పచ్చనివలువ వాని.'' కవిలోకబ్రహ్మ. 704. పవెకంపుఁగుపుస్సు వెట్టి యేనుఁగుకొమ్ము రోకండ్లతో వెపవవిస్యము దంచుటవు ''కుమరుగఁ జంగ సాఁచి చనుగుబ్బలు నూటగఁదారుటాకువ। య్యోవ పొవలంగ నెన్నుదు రొకింత చెమర్పఁగ మేచెబాలి (?) నే। ర్పు దొరలఁజాడి చందనపురోలున నేనుఁగుఁగొమ్ము రోఁకటఁ బ్రిదిలెడు కొప్పుతో వెపవవిస్సము గుప్పనిజ్యాపియాంగనల్'' అని రఘునాథరాయల వాల్మీకి చరిత్రము-ఆ-౨-౧౧౬.

760. పోల్చిచూడుము. ఆముక్తమాల్యద. ఆ-౪-౬౨. 790. ఈ పద్యమునకుఁబూర్వ మొక్కపద్యము నాప్రతులో విడిచిపోయినట్లు తోఁచుచున్నది. ప్రబంధమణిభూషణములోఁ గుమారసంభవములోనుంచి యేడాశ్వాసములలో ౪౦, ౨౬౭, ౨౮౩, ౪౪౭, ౭౭౪, ౭౯౧, ౭౯౨, ౭౯౬, ౯౩౩, ౯౬౩. ఈ పద్యము లుదాహరింపఁబడినవి; దీనిలోనివని యీ క్రిందిపద్యము కూడ నీయఁబడినది. అది నా ప్రతులలో విడిచిపోయెనేమో. ''భూచరులంబరంబునకు పోవుటమేలన నంబరేచరుల్। భూచరవృత్తి మేలనఁగ భూచరఖేచరు లాజలప్రవకే। శీచర ణంబు మేలన జలేచరు లంబరమధ్యయానమా। శ్రీచరణంబు మేలనగఁ దీవ్రని దాఘము పర్వె నుర్వరన్'' ఇది 792గా నుండవలయు. దీనిఁ గేతనకాదంబరి లోని క్రిందిపద్యముతోఁ బోల్చి చూడుఁడు.

సీ॥ కడువేఁడిపెల్లెంచ ప్రుడమి పేల్చినఁబొద్దు
  లాకాశగతియె మేలని తలంప
వాత్యాభిహతి లగ్గ వాడి వియచ్చరు
  లవనిపైఁ జనుట మేలని తలంప
వడవడగా నీరు లుడికెన జలచరుల్
  వనచరవృత్తి మేలని తలంప
వనములఁ గార్చిచ్చు దనరెన వనచరు
  లంబుసంచరణ మేలని తలంప
వాఁడిమెంచ గాసె వడిగొనె సురగాడ్పు
లెసఁగె వడయగాలి నెగసి వీచె
తాపవహన మడరె జీవుల కధిక సం
తాపకారి యగు నిదాఘవేళ. —కేతనకాదంబరి.

792. పోల్చిచూడుఁడు "ఎత్తుగీతె. తలఁపఁదతవ మనము దరికొనుఁ జూచిన తెప్పలెల్లఁ గమరి యొప్పు తఱుగు। నపలఁ బేరికొన్న నాలుక వొక్కు నిదాఘకాల తపన తాప మడరె." విజ 812. ఉప్పరిపెనము — "కలయంగ ధారుణీతల మగ్నితప్తమై యుప్పరిపెనమట్టు లుబ్బి నమునమునఁ। ననపర్వతంబులు కొలిమిలోఁ గ్రాఁగినయినుపముద్దల క్రియ నెసఁగి యుండ" విజయసేనము 961. గట్టివాలు — మఱియొక ప్రయోగము :— "సీ. ఘనసారకస్తూరికా గంధముల నన్యగంధబంధంబులు గఱపి కఱపి। కుసుమితపల్లికాలసితవీథులఁ జొచ్చి గని సరోగృహములఁ మునిఁగి మునిఁగి। సమధికాహోత్ర్యాంగ సంగీతములతోన కన్నెతీగల కాట కఱపి కఱపి। కుముదకుట్మలకుటీకోరకంబులు దూఱి యలిదంపతుల నిద్రఁదెలిపి తెలిపి। యసదిసమ్మ నప్పురాంచికమ్మన గట్టివాలువోలె విప్రవరుడు వోలె। నట్టు వోలెఁ దాను నచ్చినచెలివోలె। మలయుచుండు మందమారుతంబు."

పీఠికలో-౮-వ యాశ్వాసములోని చంద్రికావర్ణనము జక్కన గైకొన్నట్లు ఆ రెండుగ్రంథములలోని పద్యములు చూపితిని. తద్వర్ణనమునే కృష్ణవిలాసమున వేంకటకవి "సీ. ఆకాశనది యని యనిమిషాంగనలెల్ల వేడుకతో జలక్రీడ సలుపఁ బాలమున్నీరని పంకజనాభుండు ఫణిశయ్యఁ గావించి పవ్వళింపఁ। బాదరసంబని మోదించి సిద్ధులు మించి ఘటంబుల నించుకొనఁగ। నమృతంబుసోనని యఖిలామరశ్రేణి చెలఁగి పానంబులు సేయుచుండ। వెల్లివిరియుచు నుబ్బుచు విశదకాంతిఁ బొదలుచును దివ్య మగుచును భూరిమహిమ। నఖిలలోకంబు కానంద మతిశయిల్ల। నచ్చవెన్నెల విమలమై పెచ్చు పెరిగె." చోళుని ఆ భావములలో జక్కన యొక నాలుగును వేంకటకవి మఱియొక నాలుగును గ్రహించుట చోద్యము. పాదములును మార్పులేకున్నవి. పైకృష్ణవిలాసముననే, "నిజరూపరేఖల నెలఁతల వలపించుచాతురి గలభద్రజాతివిటులు। పలసినఘనము లవ్వారిగా నొసఁగుచుఁ దరుణులఁ గరఁగించు దత్తవిటులు! మణిమంత్రయుక్తిచేత నఖమధ్యలఁ గరంచు మగటిమిగల కూచిమారవిటులు। వలరాజుకళ లుండు నెళవులు భేదించి సతులఁ దేలించు పాంచాలవిటులు। వరుస నంచలు తమజాతివారి వారికాతపవనలఁగూడి సంజాత మదన। కదనకేళివిహారసంపదలఁ బొదలి। మొదలుమరు వీట నధిక సమ్మదము లొంపపె" అనుపద్యము, కుమారసంభవములోని ౮-వ ఆశ్వాసమున నుండు క్రింది పద్యములోనుండి గ్రహింపబడినది :— కమియని లేని శృంగా

రాదిచేష్టలఁ బచరించుచుండు నాభ్రదునొల్లి। మృదురేఖ ననురక్తిఁ బొదలించి బాభ్రవ్యు గాపించుకొనునా పాంచాలు నొల్లి। ఘనమెక్క నీగియ తగులుగా రతి బెట్టిపను సేయునట్టి దత్తకుని నొల్లి। మనసీక మందుల మాయల మరగించి కారించు నాకూచిమారునొల్లి। గలిచి తాల్మి గల్గుఁగలిపించి పేటంబు నలుప్ర నెదురుఁ దన్నుఁగలిచెనేని। దానుఁగలిచెనేని తగ నిచ్చు నసువిసుం డని మనోజ్ఞునొక్కవనిత గలిచె." కుమా. ఆ-౮.

ఈ కృష్ణవిలాసకర్త యగు వేంకటకవి, కవిస్తుతిలోఁ గవిత్రయమును వేములవాడ భీమునె కేతన కవిరాక్షసుని శ్రీనాథసోమభాస్కర పుత్తేటి రామన పెద్దన తిమ్మన తెన్నాలి రామలింగుల స్తుతించి యుండినందున నిటీవలివాఁ డని చెప్పనక్కఱలేదు. నన్నెచోడుని ౨౦౦ సంవత్సరముల కిటీవలివాఁ డని చెప్ప సాహసింతురేమో. పైఁ జూపఁబడిన పోలికలన్నియుఁ దత్తత్కవులకు వేఱ వేఱ హృదయములలోఁదోఁచె ననియు నన్నెచోడుని కావ్యము వారు చూచిన వారు కారని మనస్సిద్ధాంతవేత్తలు చెప్పినచో నంగీకరింపవలెను.

# 2. కుమారసంభవము

## ద్వితీయ భాగము

ఇమ్మహాకావ్యమునకుఁ గర్త నన్నెచోడదేవుఁడు. అతఁడు కవిరాజ శిఖామణి యనియుఁ డెంకణాదిత్యుఁ డనియు బిరుదములు గలవాఁడు. నన్ని యఘట్టాదిశబ్దములలో ద్వితీయాక్షర మికార మగుటను గొన్నిశాసనములలో నన్నిచోడుఁ డని యుండుటచేతను నన్ని యని సత్యార్థకవాచక ముండుట చేతను నన్నిచోడుఁ డని చెప్ప నొప్పును. చోడశబ్దము కంబఁడు, తిక్కఁడు మొదలగుశబ్దములవలెఁ జోడఁ డనియుఁ, జోడు అనియు నిరుదెఱఁగుల వర్తించును. అయినను నా ప్రతులలో నన్నెచోడుఁ డని యున్నందున శబ్దరూప నిష్పత్తు లెట్లున్నను దానివర్ణక్రమము మార్చి వ్యవహరింప ధైర్యము చాలక యట్లె ప్రయోగించుచున్నాఁడను. ఇక్కవి సూర్యవంశజక్షత్రియుడు; చోడ బల్లికిని శ్రీసతికిని బుత్రుఁడు. వివిధయజ్ఞములకుఁగర్త; జాహ్నవీస్నానలు పూచు నట్టిదియు జాతికోటి గట్టిగాఁగూయునట్టిదియు నగునొరయూరికి నధిపతి. కావేరీ తీరమున నుండు నొరయూరిపురమునకుఁ గో౞ి (కోడి)యనునామము కలుగుట ద్రవిడభాషాకృతులలో సుప్రసిద్ధము. ఆంధ్రచోడులు కారితకావేరీతీరకరికాల చోడవంశజు లగుటయు నొరయూరిపురవరాధీశ్వరు లగుటయుఁ జోడశాసన విఖ్యాతాంశములు. అయినను నన్నెచోడునివర్ణనము నించుకచక్కఁగానాలో చించినచో నతఁడొరయూరికే పరిపాలకుఁడనియుఁ గేవలము కులక్రమాగత బిరుదమును బేర్కొన్నవాఁడు గాఁడనియుఁదోచకమానదు. మననన్నెచోడుఁ డెక్కాలమున నుండెనో నిర్ణయింపఁ దగినయాధారములు సంపూర్ణముగా లభింపవయ్యె. లోకములోని మహాకవుల గతు లన్నియు నిట్లె సందిగ్ధమత భేదములపాలయ్యె. లోక మితని కవితాప్రభావ మిట్టిదని యెఱుంగఁగాఁబోలుఁ గాలము తనపట్టీయక మనల వంచించుచున్నది.

పురాతనశాసనములు పరిశోధింపఁగాఁ బెక్కండ్రు నన్నెచోడు లగపడు చున్నారు. వారిలోఁ గొందఱు చోడబల్లి యనురాజునకుఁ బుత్రులు. ఎందునఁ దల్లిపేరులు లేనందున మనసిద్ధాంతమునకు నప్రతిహతసందేహము లెక్కువ

యగుచున్నవి. ఒకనన్నెచోడుఁడు పాశ్చాత్యరాజులచే రణరంగమున క్రీ-శ-కాలం లో నిహతుఁడయ్యెను. దర్శిసీమలోని మన్నెపల్లిగ్రామముతోఁ జోడపల్లి శాసనములలోఁ బొత్తపినన్నెచోడునకు వెంకభూపతియు నతనికిఁ గామరాజు నతనికి బల్లిభూపుఁడును జనించినట్లున్నది. దీనిలో నన్నెచోడునకుఁ దండ్రిపేరును బల్లిభూపునకుఁ గుమారనామములును మన కనుకూలముగా లిఖింపఁబడవయ్యె. క్రీ. శ. ౧౧-౨౦ లో నుండిన భద్రభూపాలునకు నన్నెచోడనరేంద్రుఁడను బిరుదము గలిగియున్నట్టు నీతిశాస్త్రముక్తావళిలోఁ జెప్పఁబడినది. వీఁడెవ్వఁడో ప్రాచీనుఁడు; పెద్దచెఱుకూరిలోని మల్లిదేవునిశాసనములోఁ జోడపల్లికుమారుఁడు నన్నిచోడుఁడు, అతనిపుత్రుఁడు సూరరాజు, వానిపుత్రుఁడు రాజరాజు, వాని మనుమఁడు మల్లిదేవుఁడు, వానిపుత్రుఁడు నన్నిచోడుఁడనియు నున్నది. ఇది గణపతిదేవునికాలములో లిఖింపఁబడినశాసనము. వీరలు గాక పెక్కండ్రు నన్నెచోడులు గలరు. ఇఁక బల్లయచోడులును బలువురుగలరు. క్రీ. శ. 1135 లో దాక్షారామశాసనములోఁ గన్న రాజేంద్రచోళునితమ్ముఁడు చోడబల్లి యొక్కఁడును, గొజిదెనశాసనములలో నిద్దఱును, గడల్పల్లెశాసనములో నొక్కఁడును గాక ప్రాచీనశాసనములలోఁ గృష్ణాతీరముననుండు బీచుపల్లి సమీపమున నుండుశాసనమునఁ జోడబల్లిదేవుఁడును, మఱియొక ప్రాచీన శాసనమున బల్లయచోడుఁడును బేర్కొనఁబడియున్నారు. వీరెల్లరును క్రీ. శ. 850 మొదలు 1210 లోఁగా నుండినవారు. వీరిలో నెవఁడు కుమారసంభవ కావ్యకర్తయో నిర్ధారణము సేయుట సులభసాధ్యము కాదు. దీనిలోనిపద్యము మొట్టమొదట నుదాహరించిన యథర్వణుని కాలనిర్ణయము సహితము సందిగ్ధమే.

కృతిపతి యెవ్వఁడో చూతము. అతఁడు జంగమమల్లికార్జునమహాముని యఁట. అతఁడు సాక్షాచ్ఛివావతారము. శ్రీచక్రపీఠమునఁ బాదము లిడినవాఁడు, కమలభవకుల తిలకుఁడు, అస్పృష్టరాగుఁడు, వినిర్జితానంగభవుండు, అణిమాది గుణగణాలంకారుఁడు, అమితాథవాగమవిశారదుఁడు, సన్మునీశ్వరాగ్రణి, సంకల్పసంభవబాణేంధనదావపావకుఁడు, పరవాదీంద్రఘనాఘనానిలుఁడు, హృజ్జన్మాస్త్రాసనభక్షుఁడు, మారారి, అక్షజయుఁడు, అస్ఖలితుఁడు, ఇహాముత్ర భోగాద్యనిష్టుండు, కుంభజతత్త్వజ్ఞుఁడు, జన్మజరామూరుఁడు, అసంగుఁడు, కృత్యాకృత్యవిరక్తుఁడు. ఇట్టిముని తప్పక బ్రహ్మచర్యానవస్థితుఁడు గాని

యింద్రియసుఖము లనుభవించి దౌర్బల్యదారిద్ర్యయత్యాశ్రమాదులవలన సంగసుఖమును పరిత్యజించి హృ న్మాస్త్రాదినభిజ్ఞుఁడు నస్పృష్టరాగుఁడను బిరుదములు వహించినవాఁడు కాఁడు. । చీనులలోఁ బ్రఖ్యాతు లగుమల్లికార్జునులు మూవురు గలరు. గృహస్థుఁడై పుత్ర త్రులనుగాంచి యనేకశిష్యకోటికద్భుతమహత్త్వములు చూపిన భృంగిరిటిపుపశారమగు పండితారాధ్యుఁ డొక్కఁడును, జతుర్దిక్కులకధిదేవతలగు శైవాచారగురుపరంపరలో యామ్యదిక్కులశాధిపులలో వానప్రస్థాశ్రమవర్తియగు యోగిమల్లికార్జునుఁ డను నతఁ డొక్కఁడు. ఇతఁడు చాలఁ బ్రాచీనగృహస్థుఁ డగుటచే మనకాలమునకుఁ దగిలి వచ్చువాఁడు కాఁడు. తపోరాశి శిష్యుఁ డై చోళరాజులచేఁ బూజితుఁడై కాలాముఖ మతస్థాపనమున కాదికారణ మనఁబడిన మల్లికార్జునమహాముని మూఁడవవాఁడు. కాలాముఖ మతాచార్యు లెల్లరు బ్రహ్మచారులు. ఈమతము ప్రారంభమున నెచ్చట నుండెనో కాని క్రీ. శ. 1050 లో నుండి వనవాసిదేశమున బలిగ్రామ మనుపురమున నెల కొన్నది. అందే బౌద్ధజైన మతములును బ్రఖ్యాతము లయ్యె. పుదుకోట సంస్థానమున నుండుకొడుంబాలూరు (ఆంగ్లేయభాషా పర్ణక్రమహైన్యముచేత మోనపోయి స్థలాంతరమునఁ గదంబలూరని పేర్కొంటిని) గ్రామమున నుండుమూవర్కోవిలు శాసనములలో విక్రమకేసరి యను చోళరాజు తపోరాశి శిష్యుఁ డగు మల్లికార్జున మహాముని నత్యధికముగా సంభావించినట్లున్నది. విక్రమకేసరి పూర్వులు చాళుక్యపల్లవపాండ్యుల జయించినవారు. మల్లికార్జునుఁడు మధురాపురాగతుఁడు. అతనిపేర రాజు మఠమును గట్టించెను. కుంభఘోణపురమున మల్లికార్జునమఠమనుశైవశాక్తేయమఠ మొకటి గలదు. కొడుంబాలూ రొరయూరు పురమునకుఁ గొంతసమీప భూమిలోనున్నది. ఈవిక్రమకేసరి వీరపాండ్యుని జయించియున్నందున, క్రీ. శ. పదియవ శతాబ్దపు బూర్వార్ధములో నుండెనని శాసనపరిశోధకుల సాంవత్సరిక ప్రకటనములో రాయబహద్దరు వెంకయ్యగారు లిఖించుచున్నారు. కృష్ణాతీరమున బీచుపల్లి గ్రామశాసనములోఁ జోడబల్లిదేవుఁడు విజయయాత్రలోఁ గృష్ణాతటమున నుత్తరాయణ పుణ్యకాలమున విశ్వనాథదేవునకు క్రీ. శ. 902 లో భూదాన మిచ్చినట్లున్నది. చోడబల్లి పాకనాడు పదియేడువేల కధీశుఁడని కుమారసంభవమునఁ గలదు. బీచుపల్లికిఁ దూర్పున 50 మైళ్లదూరమునఁ దుంగాతటమున నలంపుర మను మహాక్షేత్రము కలదు. అందులో ననేక శాసనములలో సూర్యరాశి, తపోరాశి, తేజోరాశి, కాశిరాశి మొదలగుకాలాముఖాచార్యులకుఁ బాశ్చాత్య చాళుక్యరాజులు బహు

విధ సమ్మానము లొనర్చఁబడియున్నది. వారివిగ్రహములు సహితము మూలస్థాన ములో వారివారి పేరులతోఁ గలవు. ఈప్రదేశము శ్రీశైలమునకుఁ బశ్చిమద్వార మనఁబడును. మధుర సమీపములో సుప్రసిద్ధుఁడై ఖ్యాతివహించిన మంథాన భైరవుఁడను శివాగమాచార్యుఁడు కొంతకాలము శ్రీశైలముతోను నలంపురముతోను వసించి తత్ప్రదేశములలోని సిద్ధౌషధులఁ దనయానందకందములో వివరముగాఁ బేర్కొనియున్నాఁడు. అలంపురమున బ్రహ్మేశ్వరుఁడును యోగీశ్వరియు (జోగుళాంబయు) ముఖ్యదేవతలు యోగీశ్వరి యష్టాదశ శాక్తేయ పీఠాధిదేవతలలో నొకతె. మంథాన భైరవ తంత్రమున శివాద్వైతశాక్తేయరసవాద రహస్యములు వివరముగాఁ గలవు. అలంపురమును విస్తారముగా సంభావించిన రాజులు చాళుక్యులు. రెండవకీర్తివర్మ రాజ్యభ్రష్టుఁడై నప్పుడు రాష్ట్రకూటులు మాన్యఖేటపురమున రాజ్యము చేయుచుండినను చాళుక్యరాజులు సామంతులై యుండిరి కాని యనామకులైరి కారు. అలంపుర శాసనములలో మూఁడిటిలో బలవర్మ యనురాజు ప్రఖ్యాతుఁడుగాఁ బేర్కొనఁబడెను. ధారావర్షుని రాజ్యకాలములో నున్నట్లు చెప్పఁబడియె. శ్రీశంకరపాదు లుపనిషద్వ్యాఖ్యలలో మూఁడుచోట్ల నొకబలవర్మను బేర్కొనెను. శంకర పాదులు శ్రీశైలప్రాంతమునఁ గొంతకాల మున్నట్లు శంకరవిజయాదిగ్రంథములలో నున్నందున మహాశాక్తేయ పీఠమగు నలంపురమును దద్దేవీపూజాపరతంత్రుఁ డగు బలవర్మను వారెఱిఁగి యుందురేమో యనుసందేహము కలుగుచున్నది. ఈబలవర్మ చాళుక్యరాజు. బనవాసి దేశమునకు ప్రభువు. చోళరాజులకు ద్వేషి. బళ్ళారిమండల శాసనమున నితని మునిమనుమఁడు తనపూర్వవంశమును వర్ణించుకొనుచు "శ్రీమచ్చాళుక్యవంశే సమజని నిహతా శేషశత్రుక్షితీశో న్యాయోపేత......హృష్టోద్యద్ధంపికాయాం సమకృత బలవర్మాధిపః పట్టబంధం సంగ్రామైకరతః పరాక్రమధనః కాంచీపముగ్రాహవే జిత్వా వీరగజేంద్ర దన్తయుగళం సంస్థాప్య నామాంకితం ఖ్యాతాలంపుర నామధేయనగర బ్రహ్మేశ్వర స్యాగ్రతః సోయం తస్య సుతో హ్యభాయి దశవర్మాఖ్యః ప్రచండోదయః ...,..." అని చెప్పె.

ఈ శాసనకాలము క్రీ. శ. 924. దీనినిబట్టి చూడఁగాఁ జాళుక్య చోళ రాజులకు యుద్ధములుసహజమని తెలియుచున్నది. రాష్ట్రకూటులక్రిందఁబెక్కండ్రు చాళుక్యులు గొప్ప సేనాపతులై యుండుట బహుశాసనములవలనఁ దెలియుచున్నయంశము. నాయభిప్రాయమున శాక్తేయరసవాద శైవాచార్యులెల్లను మధుర, యానమలై,

అగస్త్యాశ్రమము, శ్రీశైలము, నాగార్జునకొండ మొదలగు ప్రదేశములలో నుండి తమసిద్ధాంతముల నెలకొల్పుచు దేశాటనము సేయుచు రసరసాయన శాస్త్రముల మహోన్నతికిఁదెచ్చిరి. ఈశాస్త్రములు బోధింపఁగానగస్త్యుఁడు, భోగర్, కొంకణర్, నట్టముని, మొదలగు ద్రవిడులు రసరసాయన శాస్త్రములఁ జూపినమార్గములు చరక, సుశ్రుత, వాగ్భట, శార్ఙ్గధరాది ప్రోక్తరసోపయోగ పద్ధతులకంటెఁ జాల భిన్నములైయున్నవి. శాంకరమతవ్యాపనమునకుఁ బూర్వము ద్రవిడదేశమున బౌద్ధజైనసంఘములఁ బ్రతిపక్షము వహించి పోరాడుచుండినది శైవమతము. దీనిలోఁ బెక్కు తెఱఁగు లుప్పతిల్లి కాపాలికమతముకంటె భిన్నమై రసవాద శక్తుల నమ్మి శివైక్యము పరమార్థ మనెడు శైవభేదముకలదు. దీని నగస్త్యుఁడు పన్నిరాయిరములో, భోగరు ఏడాయిరములో కొంకణరు మువ్వాయిరములోను రససిద్ధులగుటకు మార్గోపదేశము సేయుచు శివైక్యము పరమముగాఁ బ్రసాదించిరి. ఇట్టి సిద్ధులకాలములోఁ గేవలమర్థవాదులగు బౌద్ధజైనుల నోడింప శంకరు లద్వైతార్థమును వెల్లడించి మార్గాంతరమున వారికిఁ బరాభవము కల్పించి దేశము నందెల్ల షణ్మతస్థాపనము చేసిరి. అచక్రాంకమగు వైష్ణవము సురాపాన వర్జితమగు శాక్తేయమును గూడ వారంగీకరించిరి. అంతఁ దత్కాలములోని శైవమతములన్నియు నద్వైతము నాశ్రయించి ప్రబలుచునే యుండినవి. తరువాత మూఁడునూఱు సంవత్సరములకుఁ బిదప రామానుజమతము లోకవ్యాపక మయ్యెను. కేవలశైవము ద్రవిడదేశోద్భూత మనియు వైష్ణవమత ముత్తరము నుండి దక్షిణమును జయించుచు వచ్చిన యార్యులవలనఁ బుట్టెననియు నాయభిప్రాయము. ఇట్లద్వైతము జీవాతువై సాంఖ్యయోగవైశేషిక బ్రహ్మసూత్రముల ననుసరణమైన శైవమతాంతర్భేదములు నెలకొన్నకాలములో మల్లికార్జునుఁడు ప్రఖ్యాతుఁడయ్యెనని కుమారసంభవ కావ్యపఠనము వలనఁ దేలుచున్నది. వీరశైవము బసవేశ్వర పండితారాధ్యుల వలన నియమితమై లోకవ్యాపకమై నూతన స్వరూపమును బొంది సంఘములోఁ గొంతభాగము నాకర్షించుకొనెను. కాని యనాదిగ శైవమతము కాలము ననుసరించి భేదములు చెందుచుండెను. మొదల శైవము పాశుపతము, శైవసిద్ధాంతము, యోగశైవము, రసశైవము, ఆగమశైవము, కాపాలికము, కాలాముఖము, లాకులము, నకులీశము, వీరశైవము మొదలుగ ననేకభేదములఁ జెందెను. వీనిలో లాకులమునకే నకులీశ మని వ్యాఖ్యాతలు చెప్పిరి. పాశుపతము, కాపాలికము, రౌద్రము లని శైవాగమములోనే చెప్పఁబడియె. "పత్యు రసామంజస్యాత్" అను సూత్రముక్రింద

శ్రీ రామానుజాచార్యులు "తన్మతానుసారిణః (పశుపతిమతస్థాః) శ్చతుర్విధాః కాపాలాః కాలాముఖాః పాశుపతాః శైవాశ్చ ఇతి, సర్వే చైతే వేదవిరుద్ధాం తత్త్వప్రక్రియాం. . .కల్పయంతి. . .తథా కాలాముఖా అపి కపాలపాత్రభోజన శవభస్మస్నాన తత్ప్రాశన లగుడధారణ సురాకుంభస్థాపన తదాధారదేవపూజాదిక మైహికాముష్మిక సకలఫలసాధనమభిదధతి" అని కాలాముఖులఁ గాపాలికులతో భేదముగాఁ జెప్పెను. కాని కాలాముఖులు వేదబాహ్యులు గారు. కాపాలకాలాముఖమతములు మొదట శ్రీశైలమునఁ బ్రబలె నని మాలతీమాధవమునఁ గపాలకుండలయుఁ దత్ప్రాంతమునందిదని భవభూతి వచించెను. కాలాముఖులకు మహావ్రతు లను నామము నాసికబలిగ్రామాలంపుర శాసనములలోఁ గలదు. మహావ్రతమని యాజ్ఞికులలోఁ బౌండరీకమునకు నామాంతరమైనను గాలాముఖ బ్రహ్మచర్య కాపాలిక వ్రతమునకు సంకేతనామము. కుమారసంభవమున నీవిషయమై "హరికంకాలము చేతిముద్ర విదిచెం బ్రాహ్మణ్ సుభూషావహల్। గరళం బభ్యవహార మంతకతనుక్షారంబు మైపూఁత దం।కవహాసీను శిరఃకపాల మురుభిక్షాపాత్రగా విశ్వసం। హరువర్తించు మహావ్రతోపహతి నేయంబున నీప్రాప్తియే." ఇది రతిమన్మథునితోఁ బ్రసంగించిన వాక్యము. మారమద ప్రహరుఁడగు శివావతార మల్లికార్జునునకును జెల్లుట యాశ్చర్యము కాదు. సురాకుంభస్థాపనాదులకుఁ గుమారసంభవమున, "అంపకొందఱు మధుపాన గోష్ఠికింజొచ్చి మండలార్చన దీర్చి ... సుగంధాసవంబులు...చషకంబుల నించి హర్షించి. మ. శివు గౌరీసహితంబు సన్మనమునం జింతించి మైతెంచి భైరవు యోగీంద్రులఁ గొల్చి యోగినుల వీరవ్రాతమున్ వన్నియా। నవనాథాదు లనాది సిద్ధులకు నానందించి విందిచ్చియా। నవపాత్రల్ సతులర్థి నెత్తుకొని యాస్వాదించి మోదించుచున్" మొదలుగ వర్ణింపఁబడియె. కాలాముఖులు యోగమార్గము నవలంబించి యష్టాంగములును గ్రమముగా ననుష్ఠింతురు. బలిగ్రామశాసనములోన "వరకాలాముఖచక్రవర్తిముని దివ్యజ్ఞాని"... "వామశక్తిదేవరతపః ప్రభావము మం నోడి యా మహానుభావరయమనియమ స్వాధ్యాయధ్యానధారణ మౌనానుష్ఠాన జపసమాధి శీలసంపన్నరుం యష్టాంగయోగనిష్ఠాప్రతిష్ఠితనైష్ఠికచ్ఛాత్ర సంఛన్నరుం . . కవిగమకివాదివాగ్మిప్రముఖవివిధ విద్వజ్జనానందకారణ జంగమ కల్పభూజరుం వేదాంతసిద్ధాంతాగమషట్తర్కసకలవ్యాకరణ నిర్మలశాస్త్రానేక శాస్త్రార్థ నిర్ణయనిర్ణిక్తరుం.. శ్లో॥ యః సర్వదావినిరతస్త్రుకీర్తికాంతాసఖోఽపి బుధవృందసుతాప్తితోఽపి నిత్యప్రియోఽపి యతి రిత్యభిధీయమానః శ్రీగౌతమో

ముని రభూ ద్భువనే విచిత్రం'' అని యొకానొక కాలాముఖాచార్యుని వర్ణనము గలదు. ఈలక్షణములు కృతిపతియగు మల్లికార్జునునను గలవు. శివునితపస్సు వర్ణించునప్పుడు "పద్మాసనస్థుఁడై భావించి శోషణదాహనపావనతర్పణముల। దేహోదయాత్మప్రతిష్ఠలు విధియించి యాగమరీతి బ్రహ్మాంగవర్ణ। విన్యాసములు దీర్చి విమలాత్మదీపంబు ప్రణవసంపుటముగాఁ బ్రజ్వలించి। వడి బాహ్యవర్తనల్ విడిచి ప్రత్యాహారగతి మనస్సంతర్ముఖమ్ము సేసి। తన్నుఁ దానె కాంచి తన యందుఁ జేతోలయంబు సేసి నిశ్చలాత్మయోగ। మహాసుఖామృతాబ్ధిమగ్నుఁడై వరదుండు నిరతిశయసమాధినిష్ఠ నుండె" అని యోగమార్గధ్యానము వర్ణింపఁ బడియె. ఇందు నుదయ మనఁ బ్రాణము, బ్రహ్మాంగవర్ణములు శైవాగమమున సుప్రసిద్ధము. మూలబీజాక్షరములలో శివాంగము, బ్రహ్మాంగము, విద్యాంగము లని మూఁడుభాగములు. "బ్రహ్మాంగంచ తతః త్రుటిః। ప్రథమా త్వంచపంచాని బ్రహ్మాణీత్యుదితానివై'' అని తల్లక్షణము. పార్వతియు ''ఘోరతపంబు సేయఁ దొడంగి... నిరాహారాది మహాతపోవ్రతంబుల...ప్రాణాయామ ప్రత్యాహారధ్యాన ధారణజపసమాధులనుషడంగ యోగంబుల మనోవాక్కాయకర్మంబుల'' . . . నిష్ఠఁ బూనియుండె.అవిద్యయనుమాయ జయించి తాను శివుఁడే యై సాయుజ్యము నుపాసకుఁడు చెందు ననుట యీ మహాపురాణము. కుమారసంభవమున "తాన సమస్తములోఁ దనలోనన సకలంబు గలుగ లోనను వెలియుం। దాన యయి తనకు వే ఱనఁగా నేమియు లేక తాన కలిగి వెలుంగున్" "తలఁపనని తలఁచి యించుక దలచుడుఁ దలపంగ లేక తానును లే కప్పలుకులును లేక యెప్పుడు కలిమియ పొడవైనవాఁడు గదిరి వెలుంగున్'' ''దనుజేంద్రు మాయ లన్నియుఁ ద్రిపురాసురశక్తిఁ గని యదృశ్యంబయ్యెన్। వినుతాత్మజ్ఞానంబునఁ దనరుమహామాయ చెడువిధంబునఁబోలెన్.'' "దొరకొనునింద్రజాలమునఁదోచిన రూపము లింద్రజాలమం। చరయఁగ లేక చూపరకు నన్నియునిక్కమవోలె నైనయ। ట్లిరవుగఁ బాలమూర్తికుల కెప్పుడు ద్రవ్యములెల్ల మిథ్యలై। నిరతము చూడ లోకులకు నిక్కములై చనుభ్రాంతిపెంపునన్.'' క॥ సుజ్ఞానయోగతత్త్వ విధిజ్ఞుల్ భవబంధనములఁ ద్రెంచుచు భువిలో నజ్ఞానపదముఁ బొందక ప్రాజ్ఞుల్ శివుఁ గొల్తు రచలభావన దవులన్॥'' అని యిత్యాది భావములచే శివాద్వైత సిద్ధాంతము సూచింపఁబడియె. శ్రీకంఠ శివాచార్యులు తమ భాష్యమున జీవాత్మ పరమాత్మలకు, బ్రత్యేకతఁ జెప్పి విశిష్టాద్వైతములోని దాసభావము సూచించిరి. పండితారాధ్యాదులు నెలకొల్పిన వీరశైవమున జీవాత్మ పరమాత్మ భావనలోను

మాయాకల్పనలోను భేదములుగలవు. వీరి శైవదీక్షాప్రశంస యెందును మన కావ్యమునఁ గానరాదు. కావునఁ గృతిపతి మల్లికార్జునుఁడు కాలాముఖమతస్థాపకుఁడే యని నా యభిప్రాయము. పండితారాధ్యచరిత్రమున నతని సమస్తశిష్యకోటులలో నన్నెచోడుఁడు రాఁడయ్యె. పాల్కురికి సోముఁడు పండితమల్లయ యనియే సవిశేషణముగాఁ జెప్పుచుండును. నన్నెచోడుఁ డెక్కడను మల్లికార్జునునకుఁ బండితశబ్దమును జేర్చినవాఁడు కాఁడు. పాల్కురికి సోముఁడు పండితారాధ్యునిగూర్చి పుత్రపౌత్రసంతతికలవాఁ డని వర్ణించెను. పెక్కనవోలి కామినేని యెల్లారెడ్డి కంకిత మీయఁబడిన బ్రహ్మోత్తరఖండమునఁ గృతికర్తృగురువు లింగనారాధ్యుఁడు పండితారాధ్యుని పుత్రపౌత్రసంతతిలోనివాఁడై నట్లు చెప్పఁబడియె. ఇట్టికారణములు పెక్కు లూహింపఁగా గృతిపతియగు మల్లికార్జునుఁడు భృంగియవతారమగు పండితారాధ్యుఁడు కాఁడనియు, శ్రీశైలప్రాంతమునఁ దపస్సుచేయుచు నలంపురమున మఠమును గట్టుకొని శైవమతమును నెలకొల్పుచుండినవాఁ డనియు తోచకమానదు.

చోళరాజులకును వనవాసిదేశపు జాళుక్యులకు యుద్ధము లగుచుండె నని శాసనము చూపఁబడియెఁగదా. ౯౭౦ క్రీ. శ. ప్రాంతములకె రాష్ట్రకూట రాజ్యలక్ష్మి ప్రాచీనచాళుక్యసంతతివశ మయ్యెను. అప్పుడు చోళరాజులు మాటిమాటి కలంపురీప్రాంతముల దండెత్తివచ్చుచుండఁగా గాలాముఖమతాచార్యులు బలిగ్రామ మగు దక్షిణకేదారక్షేత్రమున రాజసమ్మానమును బడసి మఠము నిర్మించుకొనిరి. మతాచార్యుల పరంపరయు రాజసమ్మానమును స్వనామాంకిత కావ్యములవలనను శిలాశాసనప్రశస్తి పద్యములవలనను లోకవ్యాపక మయ్యె. కుమారసంభవములో నాల్గవయాశ్వాసాంతమున నంకితాంకపద్యమను "హరహాసాకాశగంగాత్యమలజల మరాళాబ్జనీహారధాత్రీ। ధరకర్పూరేందుకాకోదరవరవరదిగ్దంతిపక్షీరనీరా। కరముక్తాహారకుందోత్కరరజతశరత్కాసుమదీప్యత్కీర్తీ। శ్వరుఁడాత్మారాము వాణీపతి వరగురు సర్వజ్ఞు నజ్ఞానదూరున్" అను పద్యము కాలాముఖమతమునకుఁ బ్రక్కనుండు జైనమతములో "హరహాసాకాశగంగాజలజలరుహనీహారనీహారధాత్రీ। ధరనీహారాంశుతారావనిధర శరదంభోధరక్షీరనీరా। కరహారాధారతీదిగ్గదనిరదనదీయూషదండీరముక్తా। కరకుందేంద్రేభహంసోజ్జ్వలవిశదయశోవల్లభం శాంతినాథం" అని కొంచెముమార్పుతో నగపడుచున్నది. ఈ శాసనము త్రైలోక్యమల్లునికాలములోనిది. జైనకవులు శబ్దార్థ

చౌర్యమునకు వెనుదీయ రనుటకు సహస్రప్రయోగములు గలవు. జినసేనుని యాదిపురాణమున, "అపేతరవ్యాపిషయా" "ద్వైపాద్వీపాంతరాత్" మొదలుగ భారవి శ్రీహర్ష బాణకాళిదాసమాఘాదులనుండి పెక్కుభావములు గైకొనఁబడియె. వర్ధమానపురాణమున మహాకవి యసగుఁడు మాఘునిభావములు దొంగిలుకొనె; కాళిదాసుకంటె నాలుమడుఁగులు తాను మహాకవియని చెప్పుకొన్న పొన్నఁడు శాంతిపురాణమునఁ దమయంతీ స్వయంవరఘట్ట మంతయుఁ గన్నడించుకొనియె. మఱియుఁ బూర్వకాలమున నిప్పటివలెఁ గాక రాజాస్థానములలో బహుభాషా వేదులగు పండితు లుండిరి. భాషాంతరములలోని నూతనభావములఁ దమతమ భాషలలోకి నెక్కించుకొనుట వింతకాదు. కృష్ణరాయనిసభలోఁ దిమ్మణ్ణ తిక్కన భారతమునే కన్నడించెను. దేవరాయసభలో డిండిభట్టు సంస్కృతాంధ్రద్రవిడ కవియై యుండెను. రుద్రదేవునిసభకు మహాకవి కంబఁడు వచ్చియుండినట్లు తెలియుచున్నదిగదా.

ఐలిగ్రామకాలాముఖమఠగురుపరంపర చూడఁబర్వతావళి గౌతమమునిని శిష్యవంశ మనియు నింక శ్రీశైలవాసి గురుల కాలాముఖులకుఁ బర్వతావళి యనునామము కాకతీయ శాసనములలోఁ ద్రిభువనమల్లరుద్రదేవ శాసనములఁగలని వచ్చుటయు నూహింపఁగాఁ గాలాముఖగురువులు మొదట శ్రీగిరి, యలంపురము ప్రాంతముల నుండి చోళరాజభూముల కుఱికిన చాళుక్యరాజుల నాశ్రయించుటచే దక్షిణకేదార మగుఁ ఐలిగ్రామమున నెలకొనినట్లు నాకుఁ దోచుచున్నది. ఈ శైవ గురువు లెల్లరు మధురాప్రాంతములవా రనుటకు శాక్తేయరసవాద ప్రథమా చార్యులెల్లరు తద్దేశస్థులనుట తోచుచున్నది. కుంభజుఁడు తిరుకుత్రాల క్షేత్ర మగు త్రికూటగిరిలో నింక నున్నాఁ డనుటయు నతని పన్నిరాయిర మను రస వాద శైవాగమగ్రంథము మంథానభైరవాది మహాసిద్ధులకు మూలమగుటయు సుప్రసిద్ధము. మల్లికార్జునుఁడు "కుంభజతత్త్వజ్ఞుఁ" డట. నన్నెచోళుఁడు రస వాదశాస్త్రమునఁ జూపినపాండిత్యము రసరత్నసముచ్చయాదికృతులలోనిది కాక కేవలతచ్ఛాస్త్రాంతర్గతమైనది. "రసకసాయన నిర్ఝర ప్రవాహానూనగంగా ప్రవాహాకరము లనఁ" ఇందుఁ బ్రోదక రసోదక విషోదకాదిరసాయనము లని యర్థము (మాధవుఁడు రసార్ణవమున రసాయనఖండము). "ఇనుము రసం బుతో నుడుగ నెప్పుడు నూనినఁ గాని కాదె కాంచనము" అష్టాదశసంస్కార భూత మగురసమున ప్రదహన మగు వజ్రలలో సంస్కృతమైనది కావున

సీసము శబ్దాదివేధంచే బంగార మగునని రసరత్నాకరమున వాదఖండమునఁ జెప్పబడియె. "పరమౌషధిప్రభాభాసురం బగుఁ గాని దుస్తృణజ్యోతి విద్యోతము గాదు" "పాచుఁ దమ మోషధీప్రభాభాతి" ఇందుఁ దృణజ్యోతి మొదలగు లత లూహ్యములు. (చూ-కైలాస కారకమున దివ్యౌషధీ లక్షణములు). "పరుసవే దులఁ బొంది హరికాంతశిఖిఁ గ్రాఁగి కనకంబు లగునయస్కాంతశిలలు." వేధలు స్పర్శవేధ, ధూమవేధ, శబ్దవేధ, కుంతవేధ అని నాల్గువిధములు. స్పర్శమాత్ర మున వేధించునది కావున స్పర్శవేధి. తామ్రశిలపై రసౌషధమును వత్తిలో గూర్చి వెలిఁగించినఁ దామ్రము బంగారమగుట ధూమవేధి. నోట రసౌషధము నుంచుకొని తప్తాయసతామ్రముల నినుపగొట్టములో నూదిఁనవేధించునది శబ్దవేధి. ఈ శాస్త్రమర్మముల నన్నెచోడుఁడు డక్కడక్కడ సూచించియున్నాఁడు. పైఁ జెప్పినయంశముల నన్నియుఁ గ్రోడీకరించి చూడఁగా నన్నెచోడుఁ డొరయూరి నేలుచున్నవాఁడనియుఁబాకనాటి నేలుచుండె క్రస్తాతములను - క్రీ. శ. 902 లో శాసనములోఁ బేర్కొనఁబడిన చోడబల్లి కుమారుఁడనియు విక్రమకేసరి సంభా వించిన మల్లికార్జునునకు శిష్యుఁడనియు వనవాసిదేశపుఁ జాళుక్య సామంతులతో యుద్ధముచేసి మృతిచెంది యుండవచ్చుననియు, మల్లికార్జునుఁడు కాలాముఖ మతస్థాపకుఁడు కావున నతని శిష్యపరంపరలో సోమేశ్వరుఁడు దక్షిణ కేదార మునకు మతము దరలించెననియుఁ, దరువాత నేకోరామి బసవపండితారాధ్య సోమనాథాదులవలన వీరశైవ మంకురించెననియు నామనస్సున కుపోద్ఘాతన మగు చున్నది. కుమారసంభవ కలావిలాసముల మొదటి నథర్వణుఁడుదాహరించెను. పెద్దన, రామన, గణపవరపు వేంకటకవియు నీగ్రంథములలోనిపద్యము లుదా హరించిరి. మడికిసింగన, జగన్నాథకవి, ప్రబంధమణిభూషణకారుఁడు తమ పద్యసంచయములలో నన్నెచోడుని పద్యములు గైకొనిరి. జక్కన, కృష్ణకవి, తెన్నాలిరామలింగఁడు స్పష్టముగా భావచౌర్య మొనర్చిరి. నన్నెచోడుని యత్యు పూర్వభావములు మల్లినాథపురాణ జగన్నాథవిజయాది కర్ణాటక కావ్యములలో మార్పు లేక యున్నవి.వీనికృతులు కర్ణాటదేశమున వ్యాపించె ననుటకు సంది యము లేదు. దక్షిణకేదారమున "హరిహరకమలాసనవీతరాగ బౌద్ధాలయం" బులు గలవు. పరస్పర మతగురుస్పర్ధచేఁ దత్తద్భాండారముల నన్యభాషాకృతు లుండుటయు నాశ్చర్యము కాదు. కుమారసంభవ ప్రతులలో నొకటి నాకు నైజామురాజ్యమునఁ బ్రాచీనశాసనశోధనార్థము పోవుచుండఁగాఁ గర్ణాటదేశముననే లభించెను . తక్కినవి రెండును బుద్ధద్రవిడదేశముననే యగపడెను.

ఇఁక నన్నెచోడుఁడు నన్నియభట్టాదులకంటెఁ బ్రాచీనతరుఁడని కుమార సంభవములోని వ్యాకరణఛందోవిశేషాపూర్వపదప్రయోగములు సహస్రముఖముల ఘోషించుచున్నవి. ఇతఁడు దీర్ఘముమీఁదియరసున్న నెఱసున్నగా వాడుకొనెను. "మూఁడుజగంబులకు దీప్రముగఁ బర్విన బ్రహ్మాండము కాంచినకాంచన ఖాంతము" ఇత్యాదులు పెక్కులు గలవు. ప్రాసములఁ గాక నడుమను సైతము దీర్ఘముమీఁది యరసున్న నెఱసున్నగా నుండుఁ గాని నేఁటికాలపుభాషావైశద్యము ననుసరించి యర్ధానుస్వారముగా ముద్రించితిని. ఇఱ్ఱె, తర్గు, మర్గు, మొదలగు రూపములు ప్రాకృతములుగా దీనిలోఁ బ్రాసస్థానములలోనే ప్రయోగింపఁబడియె. నన్నియకాలమునకె "తగ్గు" అనురూపము వికృతి చెందెను. "తగ్గు మ్రగ్గు" భారతప్రయోగములు నన్నియభట్టుభాగములోనే కలవు. చన్నెచోడునికాలమునకుఁ బిదపగూడఁ గన్నడమున "మర్గు" అనియె ప్రయోగింపఁబడుచుండెను. "విజయ ప్రారంభదోళ్ మర్గిపో దదటక్ష్మాపనికాయపుష్పకచయం వ్యోమైకసంకీర్ణకం"అని బలిగ్రామశాసనము. చోడుని క్రొక్కారు, ఇక్క, క్రుక్కిదము, అక్కజము, త్రొక్కిన, ఒక్కడు, చొక్కు, ఉక్కటి, స్రుక్కిరి, క్రక్కిరి, నెక్కిరి, అక్కిలి, గ్రిక్కొని, కర్కైక్క, చొక్కి, తెక్కుల మొదలగు శబ్దములు గూడినప్రాసస్థానములు శోధింపఁగాఁ గొర్ఖారు, ఇర్క, కుర్కిదము, అర్కజము, తొర్కిన, ఒర్కడు, చొర్కు, ఉర్కరి, సుర్కిరి, కర్కిరి, నెర్కిరి, వెర్కిరి, అర్కిలి, కిర్కొని, కర్కైర్కి, చొర్కి, తెర్కుల మొదలగు భాషాంతరరూపములు గలుగుటచే నట్టిపదములె ప్రాసముల వచ్చుటఁ జోడుఁడు ప్రాచీనరూపములే యుపయోగించెనని తలఁచుచున్నాను. లేఖకులు నవీనరూపములు వ్రాసికొని ప్రాచీనరూపములు దోషము లని వర్ణించి యుందురు. "శా॥ ఆకొర్ఖారనురాజుమ్రోల నిజరావానంతగేయాభ్రనా। దైకాతోద్యము" ఇత్యాది స్థలములఁ బ్రాసములలో రేఫాధిక్యము దోషము కాదని లాక్షణికు లంగీకరించిరి. ఏలః ప్రాచీనశబ్దములు కొర్ఖా రనియె యుండఁగా గాలక్రమమున భాష మాఱి క్రొక్కారయ్యె. అంతఁ బ్రాసవిరోధమునకు గతి యేమని రేఫసంయోగముచే దోషము లేదనిరి. ఇదియె దీనితత్త్వము.

నన్నెచోడుని క్రౌంచపదమున యతి విచిత్రముగా నున్నది.

"చంచుల నాస్వాదించుచు లేఁదూండ్లకరువుప్రియలకు నలఁదుచు మైరో-
మాంచము లోలిం గంచుకెపంబై పొడమఁగ నదరుచుఁ బులినములం గ్రీ-
డించుచు సంభాషించుచుఁ బ్రేఁమ బొలుచుచుఁ జెలఁగుచుఁ బొలయు సముద్య
త్కాంక్షింపగతుల్ వీక్షించుచు భాస్వజ్జ్వలనుఁడు శరవణసరసికి వచ్చెన్.

ఇందుఁ గంధసీసములవలెఁ బ్రతిపాదము రెండుభాగములుగా విభజింపఁబడి కందములవలెఁ బూర్వార్ధమునఁ బ్రాసమును ద్వితీయార్ధమున విశ్రమము మాత్రమే కూర్పఁబడియె. ద్వితీయప్రాసనియతమాత్రము నన్నియ తిక్కన కవి జనాశ్రయకారాది ప్రాచీనులు పాటించిరికాని యప్పకవి తన్మర్మము తెలియక వదలెను. తన్వి త్రిభంగి మొదలగు వృత్తములకును నీ నియమము కలదు. క్రౌంచపదము మాత్రాఛందమునఁ బడి శీర్షక మగును. ఎటన రెండవ, నాల్గవ, గణముల నాల్గుమాత్రలుగా నుచ్చరించి కడపటి గురువు ద్రోచివైచి పూర్వ గురువు రెండుమాత్రలుగాఁ బలికిన సీస మగును. ఇట్లే తన్వీక్రౌంచపదములలో నుండి ద్విపదజాతిశీర్షకము పుట్టె నని నందిభరతమునఁ జెప్పఁబడియె. రెండవ పాదము "మాంచములోలిగఁ గంచుకితం బయి పొడమఁగ నడరుచుఁ బులకములను" అను సీసపాదమగును. ఇందుఁ బూర్వార్ధమునఁ బ్రాసయతియు, నుత్తరార్ధమున విశ్రమమును గలదు ఇట్టి నియమములుగల సీసములు నన్నియభట్టు భాగములోఁ బెక్కులు గలవు. ద్రవిడభాషలోఁ దిరువాయ్మొఴి యను మహా ప్రబంధమున సీసము ననుకరించుపద్యములలోఁ బ్రాసయతియే కలదు. అట్టిదే ప్రాసనియత సీసములు నన్నియ ప్రయోగించెను. నన్నియకాలమునకే క్రౌంచపదము వృత్తము కావునఁ బ్రథమాక్షరవిరతి ముఖ్యముని ప్రాసమున్నను రెండు విరమస్థానములు ప్రయోగించిరి. ఇది నన్నెచోడుని ప్రాచీనత కొక గొప్ప కారణము. చోడునిచక్రబంధమునఁ గృతికృతికర్తృపతినామములు గుప్తములుగా లేవు. ఈ విధముగానే కన్నడమునఁ గవిరాజమార్గ మను ప్రాచీనతమ కావ్యములో సీనియతి కానరాదు. ఈ సూత్రాదు యిటీవలఁ బుట్టెనని తోచుచున్నది. చోడుఁడు "సప్రాణంబై నవరసభావభరితంబై షట్త్రింశదలంకారాలంకృతంబై" అని కుమారసంభవమునఁ జెప్పుటచే నతని కాలమున నలంకారములు ముప్పదియా ఱనియే చెప్పఁబడియె. భామహాది ప్రాచీను లలంకారములు ముప్పదియాఱనిరి. దండి, విద్యానాథ, విద్యాధర, మమ్మట, జయదేవ, దర్పణకార, పండితరాయాదులు బహుభేదములుగాఁ బ్రపంచించిరి.

ఇఁక శబ్దవిషయమున దీనిలో వాడిన పెక్కుపదములు భాషలో నశించెను. ఆంధ్ర ద్రవిడ కర్ణాటాదులు సోదరీభాషలగుటచే నొకదానిలో నస్తమించిన వేఱొకట నిలుచుట సంభవించుటచేఁ బెక్కుపదములకు ద్రవిడకర్ణాటకములఁ బ్రాచీన ప్రామాణిక కృతులలోనుండి ప్రయోగములు చూపితిని. కొందఱు

తద్భాషావాసన లేక నన్నెచోడుఁడు కన్నడములోనుండి శబ్దములు దొంగలించె నని పాండిత్యవైచిత్రి చూపెదరు. దేశ్యపదము లన్నియు మూఁడుభాషలలోను గలవు. నేనపూర్వపదములకుఁ బ్రయోగము లిచ్చితిఁ గాని తిక్కన శంభుదాసాదుల పదములకు నవీనకర్ణాటకమున నుండి చెవులు చిల్లులువోవునన్ని ప్రయోగసహస్రములు చూపెదను. వీరెల్లరు కన్నడమునుండి దొంగలింప వలయునా? భాషలలో నివి సామాన్యదేశ్యపదములు. మఱియు విస్మృతపదముల మాట యట్లుండఁగా భాషలో మహాకవిముఖమునఁగ నవతరించిన పదములలో సైతము చోడునియర్థము శబ్దోత్పత్తికి దగ్గఱించి యున్నది కాని తక్కినకవుల యర్థము లక్ష్యకోటిలో నంతరాంతరితమై భిన్నార్థము నాశ్రయించుచున్నది. అలుశబ్ద మిందు స్త్రీపర్యాయముగాఁ బ్రయోగింపఁ బడియె. ఇల్లాలు, మగనాలు, జవరాలు మొదలగు వానిలో నాలు ప్రత్యయ మయ్యె. ఇప్పుడు భార్యార్థమున వర్తించుచున్నది. కంపుశబ్దము "కమ్మ" అను మూలమునుండి "కమ్మ" యను గుణవాచకమై "కంపు" అను తద్ధితమై సుగంధార్థముననే వర్తించు చుండెను. నన్నియకాలమున నుభయవిధ గంధార్థమున వర్తించి నేఁడు దుర్గంధముననే చెల్లుచున్నది. తనుపారు = చల్లనగు. ఈ యర్థము మాఱి తృప్తిగా నను నర్థము కలిగెను. ఓడు = పాఱిపోవు (పూర్వార్థము) = అపజితుఁడగు — లక్షణార్థము. "వట్టోడినవెల్లో" ఇత్యాదులఁ బూర్వార్థములోనే వాడఁబడియున్నది. కలిమి = ఉండుట. సంపద యని మాఱెను. ఇట్లే దీనిలో శబ్దశోధనము సేసిన నవి ప్రాచీనరూపములై లక్షణ నాశ్రయింపక మూలార్థమునే యావహించు చుండును. నన్నియాదికృతులలోని విచిత్రవ్యాకరణప్రయోగములఁ దరువాతి లాక్షణికులును గవులును వదలిపెట్టిరి; లేక నూతనసూత్రములు గూర్చిరి. నేని యనుశబ్దము, అన్న్, పుదమిశ-ఇత్యాది విచిత్రప్రయోగములు భాషాంతరము లోను బ్రాచీనకృతులలో నగపడుటచే నవి తత్తచ్ఛబ్దములలోని విశేష మని యూహింపఁదగుఁ గాని సర్వస్థలముల నీ యనుశాసనము చెల్లదని యేర్పడినది. "తెమ్మరల్" మొదలగుచోట్ల తెం = దక్షిణపు, ఎరల్, లేక, ఎలర్ అనఁగా గాలి-అని తెమ్మెరల్ మలయమారుతార్థములోఁ బ్రాచీనులు లాంతముగానేక వచనముగాఁ బ్రయోగించిరి. తద్భావ మెఱుంగక బహువచన భ్రాంతిచేఁ దెమ్మెర యని నవీనరూప మేర్పడియె. వెసర్ (ధాన్యవిశేషము), ఇరుల్ (చీకటి), మదల్ (వెఱ్ఱి), తిదర్ (తెరుగుడు), ఎలం (వాల్యము), పసుం (లేఁత), తలిర్, చిగుర్, అలర్ (మిత్తి), పదల్, తరం (త్రాసు) మొదలగు పదములు

హలంతములు కావున సంధితోఁ దదనుగుణవికారములు చెందుచుండును. ఇట్లు శబ్దశక్తివిశేషములు శోధింపఁగా నితఁడు తప్పక ప్రాచీనుఁ డని యేర్పడును.

నన్నెచోళుఁడు తనతండ్రి పాకనాటిలో రాజ్యము సేయుచుండఁ దానొరయూ రేలుచుండినట్లు తెలుపుచున్నాఁడు. తెంకణాదిత్యుఁ డనఁగా దక్షిణదిశా సూర్యుఁడు. ఇతఁడు దక్షిణదిశ జయించి యీపేరు గైకొనెనో లేక యితని పూర్వులు సహితము వహించిరో తెలియరాదు. పరాంతకుఁ డొరయూరు పట్టు కొనుటకుఁ బూర్వమే కుమారసంభవము రచింపఁబడెనో లేక పరాంతకుని నన్నెచోళుఁ డోడించి రాజ్యమును గైకొనెనో స్పష్టము కాదు. పులకేశిహర్షవర్ధనాదులు పరాజితులు గాలేదా.

ఈ కుమారసంభవము నన్నెచోడుఁడు గాక తదాస్థానకవియెవ్వడైనను రచించియుండునని కొంద ఱందురు. ఎవ్వఁడైనను విరచించినవాఁడు తప్పక మహాకవి. కవి యవతారికలో "అన్యతారకవితతు లనాదరించి। వెలయసత్కవి బుధ గురుబలయువదసి। యొనరదైవజ్ఞు నట్ల శుభోదయమున। దివ్యసుకృతిఁ బ్రతిష్ఠించుఁ దిరముగాఁగ." అను పద్యములో "నన్యతారక" అనఁగా శుభేతర గ్రహములు. వితతులనుటకు వికృతులని యుండుటయొప్పు. "అశుభగ్రహ వికారముల ననాదరించి" యని యర్థము. అర్థాంతరమున, అన్యుఁడగు తారుఁ డనుకవి యొక్క కృతుల నని యర్థము ద్యోతకము. ఇట్టి తారకపినామము 518వ పద్యములో మరల శ్లేషార్థమున వచ్చుచున్నది. వీఁడెవ్వఁడో యెఱుఁగ రాదు.

ఒకవేళ మనకవి ప్రాచీనుఁడు కాఁడయ్యెనేని కొంత యేమి? నన్నియాదులకుఁ బూర్వకావ్యములు రాజప్రోక్తములే తెలుపనున్నవి. కావున నావాదములమాట యటుండ నిండు. రత్నము లెందు నెప్పుడు పుట్టినదేమి? చవులు గలవేని రాజభోగ్యము లగుఁగదా! సర్వవిషయముల నిరుపమాన మగు నీ కావ్యరత్నము కవి యెవ్వఁడైన నెప్పు డుండినను సర్వజనాదరణీయమే. "వక్తుః ప్రామాణ్యతో దేవ వచః ప్రామాణ్య మిష్యతే। న హ్యుద్ధతరా ద్వస్తుః ప్రభవం త్యుజ్జ్వలాగిరః" అని జనసేనుఁడు చెప్పినట్లు వర్ణనీయవస్తువు దొడ్డలలోఁ బుట్టునా? అల్పజ్ఞుఁడగు నాయీష్టవాఁ డజ్ఞానముచేత లేఖకదోషముల గుర్తించి ముద్రింపఁజాలకున్నను గేవలము తాళపత్రములలోని పతనక్రమమును

బోఁగొట్టి దీని సర్వజనహస్తగతము చేసినందుకే యించుక సంతోషింతురుగాక. భాషలోఁ గతిపయాక్షరజ్ఞానము సంపాదించిన ఋణము నిమ్మహాకవి కీర్తిపునః ప్రకటనముచేఁ దాచికొనఁ గలిగితిఁగదా యదియ చాలు నని పరమానందమునఁ బొందుచున్నాఁడను.

చెన్నపట్టణము. మా-రామకృష్ణకవి.
౩౦ ఆగష్టు ౧౯౧౪.

---

శ్రీ

# ప్రాచీన శబ్దాను శాసనక్రమము

క. వ్యవహారాచారామం నవనవతయ కోరునూత్న నాగరకుల నీ-
నవసూత్రప్రాచీనాంధ్రవచో వ్యాకరణ మెంత నవ్వించునొకో.

1. సూత్రము.

భాషలో శబ్దములు ప్రాయశః హలంతములు. ద్విత్వములు తక్క హల్సంయుక్తాక్షరములు లేవు. పరస్థఋకారసదృశరేఫము వ్యత్యపాతవిధిఁచే (Metathesis) బూర్వాక్షర సంయుక్తి నెందు. హలంతముల కభావము పర మైనచో నికారోకారము లూఁతగా నగు. అనునాసికాంతముల కూఁతగా నుకారము వచ్చునప్పుడు తత్తద్వర్గ తృతీయాక్షర మూఁతగా నాగమ మగు.

మలక్, కాజ్, నంజ్, రాముణ్, పేణ్, అంన్, పమ్, గాలామ్, వలమ్, ఎదమ్, ఏమ్, వరమ్, చేమ్, కుమర్, నుమర్, అలర్, ఎంర్, కుయల్, ఇయల్, ఒసక్, నేఱ్, వఱ్, తేఱ్, తోఱ్, మొదలగునవి హలంతములు.

తల్లి ప్రభృతుల ద్విత్వములు. వ్యత్యపాత రేఫ సంయోగమునకు; పరమ్ (ప్రాఁతది) ప్రాఁ. వఱచు = వచ్చు—రేఫలోపము. కొఱ్ × త - క్రొత్త. కిఱ్ × కొను = క్రిక్కొను. కుఱ్ × కిదముగ (కుఱుచ - వగ్గడించు) = క్రుక్కిదము = వట్టిము. కఱ్ కు = క్రక్కు, ఈ రేఫము కొన్నిచోట్ల లోపించును. అఱ్ × కిలి = అక్రిలి. అక్కిలి. నేఱ్ + చు = నేర్చు, నేచు. తోఱ్ + చు =

తోర్చు (ప్రాచీనరూపము), తోచు. తోర్ = ఆగపడు. తోచు = అగపఱుచు. త్రోవ = అగపఱుపునది (రకారవ్యతిపాతము); కుదుర్, అలర్ — ప్రభృతి హలంతములు కూఁతగా నుకారమురాఁగా కుదురు, అలరు, అలవు — అలవి, తనివి — తనివు — మొదలుగానయ్యె.—

మలజ్, కాజ్! పరఙ్, వేఞ్, రాముణ్, అలన్, పమ్మ్ మొదలగు ననునాసికముల కూఁతగా నుకారము పరమై వర్గతృతీయాక్షర మూఁతగా రాఁగా, మలఁగు, కాఁగు, పరఁజు, వేఁడు, రాముఁడు, అలఁదు, పంబు, గారాఁబు, గాలాఁబు, వనఁబు, ఛత్రఁబు, చామరఁబు, మొదలగురూపము లేర్పడియె. వనము, ఛత్రము — మొదలగు ముపర్ణకాగమము ప్రాచీనభాషలోఁ గానరాదు. వనఁబు లనియె చెప్పనొప్పు. ఇట్లె వలమ్ = కుడి. వలఁబురి = దక్షిణావర్త శంఖము. (పురి యనఁగాఁ జుట్టికొనినది.) వలమురి — దుష్టరూపము.

3. ఇ ఉడలకు లఘుత్వగురుత్వములు గలవు. చజలు నిత్యదంత్యములు. ఊఁతగా నగునికారోకారములు లఘువులు. ప్రాచీనతరభాషలోని ఱ కారమునకు మాఱువచ్చు డకారము లఘువు. పాడు, కడుపు, పొడము, కోడి, ఏడు — మొదలగువాని డకారములు లఘువులు. ప్రాచీన శాసనములలో లఘు గురు డకారములకుఁ బ్రత్యేకాకృతులు గలవు. చేసి, చీమ, యిత్యాదుల చకారము సైతము దంత్యము కావుననె ప్రథమమీఁదను యాంతముల మీఁదను సకారమయ్యె. చేయ్ + చెణ = చేసెన్. మలయ్ + చెణ = మలసెన్.

4. పదములకు సంధిలేదు.

అతఁడిచ్చెఁ మొదలగుచోట్ల లఘూకారాగమము రాకుండెఁ గాని వచ్చి లోపము పొంద దయ్యె. ఏమ్, అద్, మఱ్, మొదలగుచోట్లు హలంతములు కావునఁ బరమగు స్వరముతో నూఁడుకొనియె. ఇందికారము లఘువుగాన పరమైన నాగమము రాఁజాలదు. పొలసాడు మొదలగుచోట్లఁ బొలయ్ + చు = పొలసు = పొలసాడి

క్త్వార్థకేకారము భాషలోఁ బ్రయోగబాహుళ్యమున గురు వయ్యెఁ గాని ప్రాచీన తమభాషలో లఘువే యై యుండును.

5. అనునాసి కాంతములఁబ్రత్యయ శబ్దపర్వతములచే ననునాసికములు లోపించినచో నర్ధోచ్చారణము వికల్పముగా నగు; అధునాతనభాషలో నర్ధానుస్వార మగు.

మలఙ్ × ఉ = మలఁగు. (ఇందు గకారాగమమై తేలఁబలికిన ఙ్ కు నర్థోచ్చారణమయ్యె. ఊఁడిపలికిన మలంగు అని యయ్యె.) కాఙ్ = కాఁగు. డాఙ్ = డాఁగు.

6. ధాతువులు హలంతములునుఁ బ్రథమాంతములును నగు. తుము న్నంతములు సప్తమి. వర్ (వచ్చు), చేయు, కొట్టు, కదలు, మునుకు, మునురు మొదలగు సమస్త ధాతువులు ప్రథమాంతములు. చేయన్ = చేయుటయందు. కొట్టంబడియె = కొట్టుటయందు మునిఁగిపోయెను. (భాషలో నెందును గర్మణి ప్రయోగము లేదు. తినఁబడియె = తినుటలోఁబడియె)

7. మల జాదిధాతువుల ఙకారమునకు యకారాదేశము వైకల్పికముగా నగు. ఉదా: — మలఁగు — మలయు, వెలుఁగు — వెలియు, నలఁగు — నలయు, డాఁగు — డాయు, అడయు — అడఁగు, మునియు — మునుఁగు (నష్టమయ్యె), కాఁగు — కాయు, చెలఁగు — చెలయు. మొద.

8. అడ జాదుల ప్రథమాచ్చునకు వ్యతిపాత మగు. అడఁగు — డాఁగు, అడయు — డాయు, అరయు — రాయు, అలయు — లాయు, అవియు — వేయు, (నష్టము) — వేఁగు, ఎలయు — లేయు, ఒరలు — రోలు, ఒజలు — జోలు, ఒరయు — రోయు, మొదలగునవి.

9. భూతార్థక విశేషణమగు ఇన ప్రత్యయము "ఇత" తద్భవము. పడిన - పడిత, చేసిత + ఎఙ (చేసినట్టునేను) = చేసితిఙ. (చేసితెఙ - ప్రాచీన తరరూపము)

10. ఇఙ — ఎఙ — ఇవి, ఎఙ అఙ ప్రాచీనతరరూపము, అ, ఆల్, అఙ ప్రభృతి ప్రత్యయములు సర్వనామ వికారములు.

11. విభక్తులు మూఁడె. ప్రథమాద్వితీయాషష్ఠులె. తదితరవిభక్తి ప్రత్యయములు సంస్కృత విభక్త్యర్థవాచకములు షష్ఠిపైనవచ్చును.

రామునిచేత = రాముని యొక్క హస్తమువలన. తోడ = తోడునందు, కొఱకు = తక్కువను. (రామునికొఱకు = రాముని తక్కువను నని యర్థము.) కై = కు + అయి. వలన + మార్గముగా. కంటెఙ — కంటఙ — ప్రాచీన రూపము. కనుటయందు—అని యర్థము.

12. కొన్నిచోట్లఁగవలకును వరలకు నభేదములు. కురుల్ = చురుల్ = చుట్టలు — (ద్రవిడభాష) పనఁడు — పరఁడు, అనఁడు - అరఁడు - అప్రత్యయ గవాంతములకు వకారమునగు, మూగు — మూవు, నెగులు — నెవులు, మొద.

13. అల్లనప్రభృతుల యంత్యాచ్చేవార్థకమె. కాన (కాఁ × అ = అగు చుండఁగానే)

14. తీగాదులందు గకార మకారమ కాక యెత్వము కాదు. తీగ, సరిపణ, మురిపము, తిరిపము, గజ్జ, వీణ ఇత్యాదులకు నియాదేశము రాదు.

15. లఘూకార, సంయుక్తరేఫ లఘుడకారములకు సంయోగమున లోపసవర్ణత్వాది వికారము బహుళము. చిలుక — పూర్వరూపము చిక్ల, చిల్ (భాషాంతరములఁగిళ్), + ఇలేకడ = చిలి, చిలు; స్వార్థమునఁ గకారము. చిక్ల ఉకార మూఁదఁగా జిలుక. (ఇట్లె పదాంతములమీఁదిలఘూకారేకారములకుఁ బ్రత్యయములు పరంబగునపుడె యచ్చు లోపంబగు. లఘుడకారము మీఁది యచ్చునకులోప మగు కడుపు, పౌడము మొ. కడుపు ప్రాచీనధాతువు - కఴ = త్రోచివైచుట. పువర్ణకము కృదంతము. కడ్ + పు - ప్రాచీనరూపము వైకల్పికముగాఁగడుపునగు)

16. రేఫాదిసంయోగముల లఘూచ్చారణ మగు.

17. ముందఱు ప్రభృతులు హలంతములు — ముందఱ యన సప్తమి,

18. తెలాదులు లకారాంతములు; గుణవాచక మగుచో నికారాగమ మగు. తెలి, వెలి, పలి, పలినాడు మొ. తెలామలకు ద్విత్వలకారమునగు. తెల్ల, నల్ల, వెల్ల, చల్ల, పల్ల, పల్లనాడు, పల్లవెంద్రుకలు. తెలాదులఁదత్థితమునఁబువర్ణాగమ మగు. తెల్ + పు, నల్ + పు — చల్ + పు. ఉకారాగమము నవీనరూపము. తెల్పు, తెలుపు, వెల్పు, వెలుపు - మొద.

19. మలజ్ ప్రభృతుల ప్రేరణార్థమునఁ జుకారాగమము పరమగునపుడుచ్చారణార్థక వర్ణతృతీయాక్షరాగమము రాదు. మలజ్ చు = మలఁచు

20. ధాతువులకు భావార్థకమున "ఉడ్" ఆగమ మగు. ఇందు డకారము లఘువు. చేయి × ఉడ్ = చేయుడ్ (ప్రాచీనరూపము). చేయుడు. (ఉకార మూఁదిన రూపము. ఇది సప్తమిలోఁ జేయుటయగుట. ఇదియ నేఁటిభాషలోఁ బ్రథమావిభక్తిరూప మయ్యె.)

21. తాఁకు ప్రభృతి ధాతువులకుఁ బూర్వ రూపములు తన్కు, తనుకు. అంటాఁక = అది తాఁకునటకు.

22. రేఫశ్లిష్టహల్వర్ణములకు నధునాతనభాషలో రేఫలోప మగుచో నుపధాక్షరము హ్రస్వమగునేని సంయుక్తహల్లునకు ద్విత్వమగు. ఉర్కు – ఉక్కు, నెఱ్కు – నెక్కు (సమీపించు) ప్రొర్కు – త్రొక్కు, ఒర్కఁడు – ఒక్కఁడు (ఒర్ = ఒక) ఏర్కి – ఎక్కి (ఏఱ్ = ఎక్కుట.) కిఱ్కొన = క్రిక్కొన (కిఱ = దగ్గఱించు.) కఱ్ఱెర్కి = క్రక్కెక్కి, సుర్కిరి = స్రుక్కిరి (సురుగు = శుష్కించు. సురుకు ప్రాచీనరూపము). కర్కిరి – క్రక్కిరి. వెర్కిరి = వెక్కిరి (వెలిలోని లకారము రకారమయ్యె). నిర్కెడు – నిక్కెడు (నిఱుకు - లేచినిలుచుట). నొఱ్కుదు–నొక్కుదు. (నొఱుకు - నుఱుకు - నుఱుగుచేయు). [నన్నెచోడుఁడు రకారయుక్తముగానే ప్రయోగించి యుండునని గ్రంథశోధన వలనఁ దెలియుచున్నది.]

---

శ్రీ

## లఘుటీక

ఇందు శబ్దరత్నాకరాది నిఘంటుస్థములు కాని ప్రాచీనశబ్దములకు నర్థాంతరముగల శబ్దములకును భాషాంతరప్రయోగముల ననుసరించియు సందర్భోచితముగాను నర్థము వ్రాయఁబడును. దీనిలో నుద్ధృతమగుసంఖ్య రెండవభాగములోని పద్యములసంఖ్యను దెలుపును. 4. కన్నెఱింగి = జాడఁదెలిసి. "ఎంతకన్నెఱుఁగనిమెయిసాపెమోసల" ఉద. ఆ. ౨. ౫౮. 6. తప్పఁజూచు = నిర్దయముగాఁ జూచెడు. పలుపడుట = అలయుట. 7. నెఱి = పరిపూర్ణత. 8. సావి = సవి = అసిక్రమముతో. 9. నెవులు = చలించు. వెన్నెలతీగలు = జ్యోతిర్లతలు. పూర్ణిమారాత్రులలోనే యెటునటు వొలయుచు వెలుఁగుచుండెడులతలు. కంపు = కమ్మనివాసన. తెమ్మెరలు (తెం + ఎరల్) దక్షిణపుగాలి. ఇది యేకవచనము. తెమ్మెర యనురూపమసాధువు. 10. దివ్యాహారము = అమృతము. 11. మెలుపు = ఆకసమార్గము. 12. పంకోట = ప్రేమయనుమగ్గమున. దొరయు = సమానము. "కామినికాఁ బ్రొదరె" గదా. ఆ ౧ ౫.

గెవలొ (కెవలో) - సహచరులో. 16. ముందఱు = పురోవృష్టి. చిందము (ఛేదము) = విఱుగుట. దేసి = అందము. 18. లత్తకా = లత్తుక. 19. ఆరోహిణ్యుపరోహిణులఁబై సీసమున నంగవర్ణనము సేయఁబడియె. తావగొనక = నిల్పోపక. "వారణసేయఁ దావగొనవా" శ్రీనాథునిసప్తశతి. "తల్లడంబునం దావగొనంగ లేక" నిర్వ- ఆ - ౮. 22. సురగజ్జెలు = మ్రోయుచున్నమువ్వలు. ఘర్ఘరములు = గజ్జెలు.

25. ఆయగంబు = చప్పరము

34. పొందులు సంగతులు. 36. జల్లితొంగళ్ళు = కుచ్చులు కట్టిన చిన్నగొడుగులు, 42. వాతపూరణములు గాలితో నిండి తలగడలవలె సౌధాగ్రముల ప్రేలాడఁ గట్టఁబడినధ్వజవిశేషములు. "వాతపూరణంగళిం నొందంతె దెసె దెసెగె పొంగువగొగెగళిం" శూద్రకము. కలుపడగలు = కలివడగలు = వీరధ్వజములు. (కలి = శూరుడు. పడగ = ధ్వజము). 50. పూరణ = అలంకారము. 52. పోల్చిచూడుఁడు. "సరభసలీలఁగేళిసితసౌధము లొక్కట నిర్గమించి చ । ల్లిరి నరనాథుమీఁదఁ బురిలేమలు లాజలు దోయిలించి చె । చ్చెర శరదంబువాహములు చించి బయల్పడు చంచలాలతల్ । పరిమితవృష్టి బిందువులఁ బర్వతరాజముఁ గప్పునాకృతిన్" ఉదయ. ఆ. ౫.

56. ఒప్పము = ఒప్పు. "విలాసమం మెఱసి దప్పువెసల్తొడ వాకె గొప్పమంపడె పెడగల్ల వావధుగె మంగళకారణ మత్తెభూషణం" పంపరామా—౫—౧౪౦. 59. దువ్వలువు సన్నవలిపము. 61. తని + వోవు = తృప్తి యగు. తని, తనివి, తనివు — రూపభేదములు. 64. కొసు = కాసె.

65. నిర్వాణము = మోక్షము, నగ్నత. "పగలఁ బొగిలెడివాని నిర్వాణి నొక్క తపణతాపసి" దశ. ఆ. ౫. 66. వెలిమిడి = విభూతి. చెయిసంగ = పూయఁగ. వలగొంత = కుడిభాగమునఁ గొంత. మదఁది = స్త్రీ, "మదవియర మొలెయ నల్లదొడుడియదె" లీలావతి. 81. పాల్ = భాగము. కల్లడి = పొంగు 83. లగ్గ = పూర్ణముగా. "లగ్గ బెగ్గలించు నగ్గలముగ" భార - విరా. 87. పోఁక = సంధ్యాకాలము (వేగుఁబోఁక = ఉదయసంధ్య.) 91. ఒదఁగూడి రాకకు = సమ్మతించివచ్చుటకు. 95. విఱుఁ దెక్కిన = వెనుకకుఁజిక్కిన. 99. కప్పిపిన = పూసిన. 101. నన్నలువాఱ = (కరచరణాది) సంస్పర్శ సేయఁగ,

"ఒఅపరిఁ గన్నఁ గూడఁ జనుసూరక నన్నలుచాఙ సాకు....... జారధారు ణిశా "జై. ఆ-3. చప్పరించుచు = తడవుచు. "నీ నిల్లిం తొలగెంధు చప్పరి సిదం మంతోవరీదేవియం" పంపరామా - ౧౪. ౧౨౩. 102 కూర్చువారికి = ప్రేమించువారికి. 105 వెల్పు = తెల్లవనము. "లలిత వశిత్రయం కిడదె బెళ్ళ ముఘాక్షిహొళ్" అజితపురాణములోని గర్భవర్ణనము. 103 మేలిల్లు = శ్రేష్ఠమగు చున్న. 110 గొడగు — గొడుగు రూపాంతరము. "కు డై" యని ద్రవిడమున వాడుదురు కానఁగొడగు లనుటయే ప్రాచీనరూపము. 112 పాళియ = తట్ట. 116 మెయికఱ = దేహములోని నలుపు (కళంకము). 118 దీని పోలికగల రెండుపద్యములు పూర్వభాగము పీఠికానుబంధములలో నుదాహరింపఁబడినవి. 120 పట్టించిరొ = ప్రారంభింపనూళ్లొలిపిరొ. "మంచన వింటివో వినవొ మన్మథుఁడేకశిలాపురంబులోఁ । జంచల నేత్రలం బడుం శయ్యలపై రతికేళి రాత్రిపో। రించి ప్రభాతకాలము పరిస్ఫుటమైనను దమ్ముఁ దార పఁట్టించుచునున్న వాఁడదె కుటీగత కుక్కుటకంఠకాహళిన్" శ్రీనాథునిక్రీడాభిరాముము. 124 మూరి = చిత్తవిభ్రమముతో. సూరెలువాఱు = పార్శ్వముం కొదుగుచుండె. 129• పొయిగారము = కరువు 130 మిగిలి = అతిక్రమించి.

136 దాఁపరము = దాఁచి యుంచుటలు. కట్టువాల్ప = కట్టుగ్రాడు వేను టకు. రా = రాతిలో. గంటు = గాయము. కలి = గంజి. కత్తిగొంటులు = కటారికత్తెలు. అత్తగంతు = లంజతల్లులసంఘ. "నేలయు నింగియుఁ దాల ముల్ గావించి" పిరా - ఆ - ౨ "నేలకు మిందికిన్‌దొవరి నేచ్చున సూత్రము వన్న మంచుఁ గుం । చాలను గొల్వఁద్రాక్షీపక చాలునఁవేసఁగఁ జుక్కలెన్నఁ జ। క్రీలను నారలొల్చి నెగడశ వడగంట్లను గుల్ల గట్టఁగాఁ। బోలినమేకు నిచ్చ జికి సంయమి దెచ్చుట యేమిసోద్యమే. రఘు - రామా. ఆ - ౨. 137 అల్లురు = విటులు. 138 తక్కోపక = త్రోచిపుచ్చుట సహింపఁజాలక. కను వలి = సంకోచము. 139 ఒడ్డించి = ప్రయత్నించి. ఆలములు = కలహములు. 140 వృదులు = ధనము, పట్టణములు, వేషములు, ద్రవ్యము. 141 తలపిండ్లు = తలవాఁకిండ్లు. రేసంబు = వ్యాజము = దంభక్రియ 142 కలువక = ప్రేమింపక. వృదులు = ధనము. పొచ్చపోక = హైన్యముపడక. 143 కోర = ప్రక్కకుమిడిచిన. మగలంజియలు = లంజలవలె మాయాయౌవనచిహ్నముల ధరించిన మగవారు. కాలిమాలు = వేశ్య.( = స్త్రీ). రోలుగొన = జల్పములాడ.

పాంచాలదేశస్థుడగు బాభ్రవీయుఁడు సాంప్రయోగికమున ననురాగ మ్యూపచార రసానుభవమునె ప్రతిపాదించెను.

దత్తకుఁడు = కేరళదేశపు రతిశాస్త్రజ్ఞుఁడు వైశికాధ్యాయము రచించి యందు వేశ్యానురాగచర్యలు నాయకునియావి కనుగుణముగానుండవనుగాక యని యాదేశించెను. కూచిమారుఁడు కూచిమారతంత్రమున మూఁడుపటలములలో మంత్రౌషధాద్యౌపనిషద ప్రకరణమునే మేలుగాఁజెప్పెను. భద్రాదులు నలువురను నాయకులుగా గ్రహించుకొనఁదగు. బేటంబు = అనురాగము. కలుచు = ప్రేమించు.

పోల్చిచూడుఁడు. "నిజరూపరేఖల నెలఁతల వంచించుచాతురి గలభద్ర జాతివిటులు । పలసినధనము లవ్వారిగా నొసఁగుచుఁదరుణులఁ గరఁగించుదత్త విటులు । మణిమంత్రములచేత నబుమధ్యలఁ గరంచుమగటిమి గలకూచిమార విటులు । పలరాజుకళ లుండు నెలవుల భేదించి సతులఁ దేలించుపాంచాల విటులు । వరుస నందఱు తమజాతివారి వారి । జాతవచనలఁ గూడి సంజాత మదన । కదనకేళివిహార సంపదలఁ బొదలి । మెచలుదురు వీటనధికసమ్మదము లొదవ." కృష్ణవిలాసము ఆ - ౧. 147 నెగ్గించెకా = రోతపడెను. 148. ఉరి = మంట.

151 ఆండురు = స్త్రీలు "స్త్రీలను బ్రేమింతురా ? మఱుగు లేక నిన్నుఁ బ్రేమించుటయే దోషమని కోపించెదవు. స్త్రీ నాయకుఁడు మ్రొక్కినను గోపమును దేర్చుకొనఁజాలదు., అట్టిది దైన్యముతో మ్రొక్కుటయు కాక నిన్ను బతిమాలి సేవించుచుండఁగాఁ బ్రియపై నిట్లు వక్రత్వము చూపుట నీకుఁదగునా." ఆండురనుటకు "మలయాచలంబుపైఁ జిలువయిల్లాండురఫణరత్నములయందుఁ బ్రతిఫలించి"కాశీ. ఆ-౧. "ఆసమయంబునకా మగనియాండురు గన్యలు" నిర్వచ ౩.

153. అంచు = అఱచును. 155 తక్కిన = వదలినయెడల. పురుడువారి = సమప్రేమగలవారి. ఎడయైన = ఎడఁబాటు గలిగినపుడు. మట్టు = మందమగుచున్న. 156. విటవిదూషకాదులు క్రమముగాఁ జతురోక్తి పరిహాసోక్త్యాదులు భాషించుచుండిరి. 157 తనువు = చల్లఁదనము. తెలివు = తేట. 158. కంపు = మంచివాసన. "కంపు గొనకయె కల్పవృక్షములపుష్ప। సౌరభం బిట్టి దని చెప్పఁ జాలువారు, కేతన. "పూవులకంపు మూర్కొనక" అర్థ.

159. రిమ్ముల = రెమ్ముల = ఉపశాఖలలోఁ. చేవెఱ = లజ్జ. 160 ఒట్టియ = ఒంటె. 162. "ఇంకెడుపంకమధ్యమున నెంచఁ దలంచెదుమీఁద రోలె నే గ్రాంతని ఘాస్యయుండెఁ దరిరాపులఁ జేసెదపొప్పవై" చ-ఆ-౨. 163. "ధనాసక్తిచే వలచుట హరిద్రారాగమువలెఁ ద్వరలో మాసిపోవును. విటుఁడు విరాగి యైనను నిర్వ్యాజరతసంపద గలదేని రసభావము లుద్దీపించు చుండును." 164 కాన్పు = కనుట = పొందుట. "ఇది కలరాసెకాన్పు" హరి-ఉత్తరభాగము. 165. నిజము = స్థితి. కలకాఁక = సర్వకాలము. కలుపు = ప్రేమ. 166. వలను = చాతుర్యము. "చతురత్వమును రూపమును విద్యయుఁ గల స్త్రీఁ బురుషుండు దన్నుఁ బ్రేమించునట్లు నడచుకొని తాను బ్రేమించెనేని వానికిఁ గామసుఖము సంపూర్ణమగు."క. "తను వలచుకాంత యేపని మనమునఁ దలఁచినను జేయుమగవానికి నాప్పనిత బిగిసొహపుకౌఁగిలి దినదినమును మదన కామధేనువు గాదే" ఉ-హరి-ఆ-౨. 167 "ధనము జన్మాంతర పుణ్యఫలము ననుసరించి యుండును. ఉత్కృష్టరసానుభవమునకు వెచ్చించుట ద్రవ్యనాశన మునకుఁ గారణము గాదు." 168 ప్రాలు = సౌభాగ్యము. "గృహస్థధర్మముం బఱగడ వైచి గోచికొని పాఱెడుపొల్లపు ముక్తి గల్గునేఁ పడికల నేరుపం గొలుచు పాఁతటికిం గలదే తలంపగన్" ఉ-హరి-ఆ-౪. 169. అందు = అందే మదెరము. వాలికల్ = ఏటివాలుప్రదేశములు. చికనైని = సన్నని. అక్షము = కన్ను. (ఇంద్రియార్థ మైనను లక్షణచేఁ గంటియందు ప్రవర్తించునని కొందఱు చెప్పెదరు. కమలాక్ష, అక్షపాదాదిశబ్దములలో నయనార్థమే రూఢమైయున్నది.) "కన్ను లేటవాలుగుచోట్లు, కనుబొమలు వంకలు, మఱియు హృదయములు నున్నగ జాఱుకట్టుస్థలములు, వలుదకుచములు వాఁడియగు సన్నని రాళ్ళు, మఱియు, గుణము వాలికము. మనోరతియందె ప్రౌఢలు, కావున నిట్టి స్త్రీజనముల స్వరూప మిట్టిదని రసతత్త్వజ్ఞుఁడగు పాంచాలపురుషుఁడైన నెఱుంగఁ జాలఁడు." వాలుక లను పాఠాంతరము గలదు. కన్ను లిసుకభూమివలె నెల కొనసీయక చలనభావము కలదనుట.

170 వలఁకులు = నేర్పులు. 171. ఋంజికా = చేర్వలి. "అమరలంజి కెదుర్ జాగ్గవాడి" అజిత-ఆ-౫-౯౯. 173. పేర్పెంపులు = చెమరు బిందువులు. విడిసీర = కట్టినసీర. అలుక = చల్లఁగా. 174. చరణాహతిచే నశోకము పుష్పించును. 175 చేయు = హస్తము. 177 ఓటనము = ఓడిన

దైన్యము. కట్టాయము = నిర్బంధము. "రా యెం బీపెన రెల్ల దంతు ముకిసిం మువ్యేమునూ శెంతు కట్టాయం పెంప్పళి పోగె" పంపభా-ఆ ౧౨. 178 గంటులు = గాయములు. నెట్టి = నేయగా. 179 లంబనములు = హారములు. "పొండుక మప్పహెంముకళలాకంబొళె కనకాభరణగళ్। పండిగెగళ్ మనం గొళిసె ముత్తినబంబి మొప్పె" ఆదిప-ఆ ౧-౩౬. ఎత్తుపెట్టు = రంజనమిచ్చెడు. 182 అన్నుసుకు = మిక్కిలి వలచునను. 186 వెలపుహాణె = తెల్లందాణె. 188 రమణి = స్త్రీ. "దేవకారమణాదూం బిరిమోగ యందు" ప్రభా-ప్ర. 190 మాటపొందు = అనుకూలించిన యేకవాక్యము. 202. నెంకట్టు = నియతకుట్టిమ ప్రదేశము. విలంబకములు = వ్రేలాడఁగట్టిన గుత్తులు. 203. పరుసవేములు = ఇనుమునకు దాఁకినంతనే బంగారము గావింపఁదగు స్పర్శవేధి యను రసశిలా విశేషము. 204. హంసోదకము = పగలు సూర్యతప్తమై రాత్రి సంపూర్ణచంద్రికా శైత్యము ననుభవించిన నీరు. 209. వన్నువు = వర్ణము. పోలుపొంద = సంబంధ సామరస్యము. అంఘ్రికి = మిడికి. పూర్వకాలమున మనుజులు తమ తొంగరజమును జల్లుకొనుచుండుట, నధరమునకు యావకరసము నుపూసికొనుటయు స్త్రీలకో నాచారము. "కస్మనైవ నవపాస్త్రరాక్తం యావకం యువతివంత వానసి। ఉజ్జహార మువిలః పునః పునర్మిష్ఫ్విబస్నధరపానలోలుపః" కానకే హరణం. ౮. ౩౨. 212. ముకి = కిరీటము. "విణ్ణో రంబొన్ ముకిమేల్ అక్రెత్తామరై సెన్ని వైప్పాం" జీవకచింతామణి. ఆ. ౧. హంసబిలకము = రాబిపెక్క. "నసెయం పూగళ నాలోకనమాత్రది వడెవ శెంమమెచ్చం తిలకం। నినగిత్తు దెంయభూపతి। వనితాతిలకక్కె హంసబిలకను నిత్తం" మల్లి. ఆ. ౯. ౫౮.

వస్తు = బంగారము. అపయము = రంజకము. పసవనంబులు = అలంకారములు.

219. కంపకము = దెర "కంపకపం తెరసీరె" కబ్బిగర కైపిడి-(కాంటపపళబ్దితష్టవము) 221 పలయు = సువాసన కలుగఁగా. 223 వస్తు = బంగారపు. 224 ఏకసర ప్రినరములు హారవిశేషములు. తొంగలిపట్టిను = వ్రేలాడుచున్న నునుముంగ్రె. "కట్టిద పంచవర్ణగెయ పట్టెయతొంగలొ శింద్ర చాపమం। పుట్టిసె తొట్టవజ్రకవచచ్ఛవిమొక్ చపలాకరాపమం। పుట్టిసె" పంప రామా. ౧౩-౫౯. నురంగముగా = అందముగా. 227 వాతపూరణములు =

ధ్వజవిశేషములు. 229 తంవడి = తత్క్షణము. 232. శుభోదయమునఁ బారద రస ముబ్బి ప్రవహించు నని రసాయనశాస్త్రము. పరుసవేది = స్పర్శవేధి.

236. తత...సుషిరాత్మకంబులు = వాద్యములు చతుర్విధములు. తతములు-౨౦-పరివాదిని, చతుర్దశి, ఏకాదశి, త్రయోదశి, మహతి, బృహతి, కళావతి, కచ్ఛపి, వితతము, పినాకిని, పౌర్ణము, రావణహస్తము, ఉదుంబరము, షట్పూర్ణము, హస్తఘము, సారంగి, ఆలాపిని, రుద్రవీణ, వ్యాఘ్రముఖము, బల. ఇవి కొనుస్తతో వాయింపఁబడును.

వితతములు. ౧౮. ఝల్లరి, మురజము, భేరి, పటహము, కరడ, కుడుక్క, హుడుక్క, ఢక్క, డమరుకము, నిస్సాణము, సోల్లుక, బాణము, తుంబురి, దుందుభి, మర్దుపు, డిండిమము, ఝర్ఝరము, పణవము. కొట్టి వాయింపఁబడును.

సుషిరములు. ౧౦. పాలిక, కాహలి, వాసము, ముకులి, మధుకరి, వంశము, శంఖము, శక, శృంగము, సుదర్శవి. శ్వాసముతోఁ బూరింపఁ బడును.

ఘనములు—౬. కాంస్యము, తాళము, ఘంటిక, బయఘంట, క్షుద్ర ఘంట, కర్మ.

237. అలంతులు = ముఖవీణ, తాళము మొదలగు నుపాంగములు. 230 కామలు = కావలు. 243 తప్పఁజూచిన = కోపముతోఁ జూడఁగా. చక్కఁ జూచిన = మంచిచూపుతోఁ జూడఁగా, ఋజువుగాఁజూడఁగా. 246 మేలిల్లు = శ్రేష్ఠమగుమన్న. 247 తట్టార్చి = బొలయించి. వెలరెన్ = వెలుపరెను. 248. కంటకకదళక్రతము—బలవన్మరణము నెందఁగోరి ప్రాయోపవేశము సేయు వ్రతభేదము. "రోమాంచని కుచయుగళే శ్వాసగళితమంజుకం నిదధానాత్వత్పాణి గ్రహణతృష్ణయాకంటకకదళవ్రతలీలామివ దక్షిణం కరకమలమనుభావ యతి" కాదంబరి. పాపలు = తారకములు. ఆడెనో = వసంతమాడెనో. 250. క్రోపలు = క్రోవులు. వలగొని = పట్టుకొని. 251 వల్వలు = సన్నవస్త్రములు. వెరం = కలిసిపోఁగా. ముష్టులు = చిమ్మనగొట్టములతోడి జలక్రీడలు. "అత్తఱివిపినాగరకులు చిత్తమున వసంతకేళి చిసహొత్తంగా మొత్తములుగట్టి తెప్పరి ముత్తెపుఁబ్రతులతోడ ముష్టికొమ్ముల్" "పైమెయిఁబోవఁగ నేర్చెద పి ముష్టులరింకఁ దక్కితేనియు"

252. అంగవి = తృప్తి. 260 వెడసిర = తెర. 261 మెలుత = స్త్రీ. (మెలియు = సూక్ష్మమగు. మెలుత = తన్వి. ఉకారమధ్యముగానే ప్రాచీనరూపము గలదు కావుననే మెల్తుకయని యగును) 262 వలను = దిక్కు. 266 పొలంతి = స్త్రీ. (పొలుపునది కావున పొలంతి.) "సింకఁ గాతరిల్లిన పొలంతులతో నడ యూని" ఆర్థ. ౪. 268. తఱికి = వపరి. 271 గెడగాని = జోడుగూడి "పొలఁతుక్కలయంతె గెడగొండికిదెగెన్ననగర్థనెంతుపోవక" లీలా-ఆ-౧౪-౩౭. తుంతుర్వని = తుంపురులు, (తుంతురు = చెదరుట; పని = చల్లునది వింపువు.) "తెరెవొల్లుందాపతుంతుర్వని సుటరుసుం" జగన్నాథవిజయము, ఆ-౧-౫౩. "వనకేళిక్రాంతకాంతాయుపవుష్ప సరోజంగళాక్ పాయ్దు తుంతుర్వ నియం వేఱుత్తె" లీలా-౧౩-౧౧౩. 275. తన్ని = ఊఁదుకొని. తల కెడవు = తలక్రిందు, వారి = నీళ్లతో. 277 చల్లుఁబోరు = నీరుచల్లుకొనునాట. "శతవీరకుమారులతోఁడ చల్లుఁబోరాడి" భార. ఆది. 279. కడలడి = అలల సమూహము

281. ఇంపుటీవనము వనపుష్పములుగాఁ గొందఱు కవులు వర్ణించిరి నిక్కము విచార్యము. 284 దాసి = సమీపించి.

285 "జాతే తవ ముఖాంభోజే దృష్ట మిందీవరద్వయం" కాళి.

286 సావి = అనెడు భ్రమతో. "మెలకసిమెకలక్రొన్నిగ్గులు వానవో త్పల పత్రములు సావిఁ బాయుమీటు" సాంబో - అ - 3. 287 బేలు = ముగ్ధ "కడుందోన మీవేలుండెద్దుకతంబు నెప్పుసను సంప్రీరాత్మనిఁ జేయుమఁ" దశ - ఆ ౬. చదురాలు = నేర్పుకత్తె. 288 వగ = తలంపుతో. తీర్చె = మఱుగుచేసెను. 290 ఒడమి = సొమ్ము. పరివెనలు = వంపువెనలు. 294. చలిమిరి = చల్లఁదనము. ఎడ = ఎఱ్ఱనగు. "ఎడికెంపుమొంగరా ఎడగరావె" ర - రామా. 296 రేక = రేకు. 301 అన్ని = మడంచి. 307 మలరు = పుష్పము. "మెరిసుంరిలమూం విరిమంక్ పరప్పి" మణిమేఖల.ఆ - ౩ - ౧౬౬. "చిత్తజ నిక్షుచావల తెయుంగెలెవంపుమ పుర్వినొప్పె కణ్బెత్త పమోజ పత్రదుచియం గెలెసంపుమ కణ్మలర్" అజి - ౨ - ౩౭. గెడ కత్తియ = సఖి. 307 ఎలనాఁగ = యువతి (ఎల = లేఁత, నాఁగ = స్త్రీ, ప్రవిదమున, అనంగై) 312 విస్ఫులకలు = కొంచెముసంపదలు. పొఱలు =

చిగురుష్ప; 315 కప్పు = నలుపు 317 మూవె = మూగె 318 మసమలు = సమూహము. 325 తుంచెంపు = తాల్పు. తొవిరు = రాయుట. దుల్లుకారాకులు = రాలుచున్నపండుటాకులు, ఒప్పు = శృంగారము. 326. మండలార్చనదీర్చి = శ్రీ చక్రమును పూజించి, 327. మైతెంచి = సమ్మతించి.

329. వస్తువు = శాక్తేయులును రసవాదులును పసరసుబంగారమునకును వస్తువందురు. కౌళులు = కులాచారులు = శాక్తేయులు. రసాయనము—దేహము నజరామరముగాఁ జేయఁజాలినదివ్యౌషధము, ఇది సిద్ధౌషధులరసము, లేక, యష్టాదశ సంస్కారపూతమగు పాదరసము. సిద్ధౌషధులు ౩౨. రక్తస్నుహి, సోమలతారుద్రవంతి, కృష్ణచిత్రకము మొదలగునవి. 330 ఎరియరె = కాలిపోవరె, 331 నప్పంబ = అప్పుడ. సిద్ధరసము — సిద్ధౌషధులరసము. ఇది దేహమునఁ బ్రవేశించినంతఁ జొక్కును, మనోదేహభ్రమములును, జర్మస్ఫోటనమును, నఖకేశపతనమును గలిగించి సద్యోజాతత్వమును దయసేయును. (చూడుఁడు సోమలతాకల్పము). కలయ నూల్కొని = దేహమంతయు నుద్రేకింపఁజేసి. 332 వేర్బొందువులు = చెమటబిందువులు. మట్టము = మందము. పురినమ్ములు = పురివిచ్చిన నెమళ్ళు. క్రొవ్వెదల్ = జడలు, కొప్పులు. తడుమ = తడఁబాటు వొందునట్లు . ఎడసి = తొలఁగి. 334 అన్ని = మెచ్చి. అంకమాలికలు = బిరుదులుచెప్పి స్తుతిసేయుగానములు. "ఓపనిగె పుకందిపాడిదలశొల్దు గుణప్రియ నంకమాలెయం" లీలా ౮ - ३೦. సాహురి, పలమంజరము, ఆందోళి, భైరవి' నాట, రాగభేదములు. పౌరాళి యను శబ్దము గ్రంథాంతరమున లభింపదయ్యె. బంగాళియనుటకు లేఖక దోషమాయని నాకుసందేహముగలదు. లేక భల్లారియై నను గావచ్చును.

పలమంజరము — పురుషరాగము. శ్రీరాగోథ వసంతశ్చ సారంగః పల మంజరః. సాహురి, ఆందోళి, భల్లారి, స్త్రీరాగములు. "గుర్జరీ పూర్వగౌళీచ, భల్లారీసాహురీతిచ, ఆన్దోళీతి స్త్రియఃప్రోక్తాః చతురుత్తరవింశతి" పలమంజరికి లక్షణము-"పంచమాంశగ్రహన్యాసా పూర్ణాచ పలమంజరీ హృష్యకా మూర్ఛనా జ్ఞేయా రసికానాం సుఖప్రదా॥ వియోగసిక్తాంతవిశీర్ణగాత్రా స్రజంవహంతీ వపుషాచ శుష్కా ఆశాస్యమానా ప్రియయాచ సఖ్యా సధూసరాంగీపలమంజరీయం" అని సంగీతశాస్త్రము. (ఎక్కువగాఁగోరెడువారు సంగీతసుధను జూడఁదగు).

ఆలతి = ఆలాపము. 336 పంచమహాశబ్దములు = భేరి, కాహళము, పటహము, శంఖము, జయఘంట 342. కేల్లు చేతులు. 343. తన్నవ = తన్ను + అ = నన్నని. సోఁపులాడు = క్రీడించుచుండు. 344. కొంపలించు = తగ్గించు - తలంకించు = తొలఁకునట్లుచేయు. సెరవుసేయక = కేసము సేయక = నిర్భయ ముగా "అంతునిజభుజగదెయం తూగుత్తు మిర్దదంపజూకపరాకన సెరగల్లిద మెగ్గలితనక్కె మెచ్చి తలెదంహాగె" గదా. ౭ - ౪౨. తంకెంచు = తొలఁ గించు. మెయ్వడి = మార్గమున. కానిపడిపకోలె = నమ్మలింపని క్రిపోలెనే. అలఁతి = మితి, అగ్గలింప = దాఁటిపోవఁగా. ఆఁకగొనక = ఆపుగొనకేప 347 అంజలు = భయము. రూపాంతరము - అంజలి. కాయ్పు = భావరసాతిరేకము. వజ్రలేపములు = వజ్రమును కరంచి రెండు వస్తువులంటించుటకుఁ బూయుట - చెమట బిందువులు పరిపక్వముగాఁ గాఁచిన వజ్రమువలె నుండెనట. "ఉరదిం పెర్మొలె బెంగెమూడెజెమర్గళ్ బల్వజ్రలేపంబొలా। గిరె, కీల్గొట్టిసెవంగ నీమెస్పల కం, తోళ్తోళ్గెగంటిక్కిదం। తిరె, మెమ్మెయ్యొళదంగు వంతమరె, గాఢాలింగనం గెయ్యున ల్లరదేనిర్దరొ కాని బెచ్చతెఱనిం శ్రీసత్యభామాస్వకర్" జగన్నాథ విజయము. ఇందులో నొక్కతలకు రెండు మొగములతో యమకము శ్లేష తక్కఁ దక్కిన భావములన్నియుఁ గలవు కాన సంపూర్ణ పద్య ముదాహరించితిని. "సుడిసుడెనన్ని, మాడిసుదెరానన మిత్తుదె రామరేను మా। ర్పిడిసుదెవజ్రలేపము." శివమొగ్గె తాలూకా తట్టికెరెగ్రామశాసనము, ౨౪ వ పంక్తి. (మాఱ్ = శత్రువు). మొలలు = చీలలు. 349. కాయువు, కాయుపు-చిన్నరూపములు. 351. మగుడఁబడఁ పడిపి మగుడఁజూపె. "చోదయత్యనసేహితుందనే శిక్షితుం యువతయృతైపుణం వేహపప్రశరభంపితత్రపా సా యయా రహసి కర్మకర్తృతాం" జాన-౮-౨౯.

354. వహిత్రము = ఓడ, శిబిక. సొగయింపని = చొక్కఁజేయని = ఆసక్తిఁ బుట్టింపని. "సొగయింపనిభంగిమహాపఁడయ్యెమా । యవ్వనవారి పూర్ణసుర తాద్రివివర్ధితుఁడై మదించియై । దివ్వఁడు" అనియుఁబాటమగలదు. ఇందులో యౌవనశబ్దము "యవ్వన" యని చెప్పుట దోషము. ప్రాచీనకవులలో నిట్టి ప్రయోగములు సాధువులై యుండఁగా వైయాకరణులు నాంతాదిసలును దోషపరిచ్ఛేదముల విస్తారముగా వ్రాసి నిందపుట కఠినముగాఁ జేసినట్లు తోచు చున్నది. మహాప్రామాణికుఁ డగునన్నయభట్టారకుడు భోజరాజీయమున "నవ్వుచుఁ

జెక్కుమీటె నలినస్ఫుటలోచన మాటలేలనీ! యవ్వనలక్ష్మికిఁ భటుఁడ నైతి ననుం గరుణింపు మంచు వాఁడువ్విధజలాపచుం బలుక నుత్పలగంధియు నోమహాత్మ" ౨. ౧౦౮. అనిప్రయోగించెను. అనంతునకుఁ బ్రాచీనకవిప్రయోగము లక్ష్యములై యుండును. 360. ఎలసి = ఇచ్చగించి 369. తనికిన = తాఁకినయెడల.

371. చదలు = ఆకాశము. 373 మహోదయుఁడు = అగ్ని. 376 తెప్పతీ = మూర్ఛతేఱి. కడలన్ను = తరంగసమూహములు. గ్రాము = గ్రహము. వలి = చేతులు కాళు లీడ్చుకని మూర్ఛనొందించునట్టి. 383. అనిమిష = దేవతలు, చేఁపలు. ఖరదండము = క్రూరదండనము, సముద్రము. కుముదము = లోకమునకు సంతోషము, కలువ. 380. విద్రుమ = చెట్లు లేకుండుట, పగడపుదీఁగలు 385 ఎఱఁగి = దిగి. సమూహి = గుంపు. మేలుకట్టు = వితానము. 391 ఎలమెడు = రేయుఁబవలు. 393 వన్నుప = వర్ణమే. ఉలివు = ధ్వని. 395 దీనిలోని యమకప్రయోగము పీఠికలోఁ జర్చింపఁబడును. అకరువు = కేసరములు. 397 భండారువు = సొమ్ము 398 కనుబేటంబేటంబు = చూడ్కివలనఁ గలిగిన యనురాగాతిశయము. వివృత = తెఱచిన 401 అక్కలి = సమీపముగా. ఉచ్చలించి = (దేహము) వడఁకి. కర్కొక్క = పులకరింపఁగా. అల్లు - చల్లఁగా. 403 దలము = లావు. సరలు = రేఖలు. కప్పిరి = నలుపు. వలిసె = నుడిసె, చుట్టుకొనియె. తనరె = విస్తరిల్లెను. 406 డిగ్గఁదావి = (దిక్కు) వదలి. "ఇన్నాతిడిగఁదావి యేనువాఁడిన మగతనము నిష్ఫల మగు ననితలంచి." "డిగఁదావిపోవక యగపడ్డవస్తువులు"దశ. ౫. 408. ఆవలచి = వ్యసనము. 416. సురభులుచేఁపె = కామధేనువులు పాలు పిదికె. 421 ఎడయాడి - ఎడఁబాసి. విసిని = తామర. తావగొని = విశ్రాంతిగొని. వెలడు = వెలువడు. ముచిమి వో-దీని నీరు చంద్రోదకమువలె రసాయనకల్పము కావునఁ బుణ్యావనమును దయసేయును. అరిమిలి = ప్రేమ. తమ్మితాల్పుడు = విష్ణుఁడు. 426 కఱుకెక్కి = పులకరించి. 431 కాల్గొనక = కాలూఁదనేరక. మొగతిరుగుడు = పెడమొగము పెట్టఁగా. సారి = చక్రము. 435. అబ్బగింపక = ఓర్వక. 446 తరమున = క్రమముగా. పొంపిరిగొన = నిండఁగా. 447 పాలు = భాగ్యము. 449. ఈపద్యమున నాగాబంధములలో నాకచిత్రము గలదని తోచుచున్నది. 450. దీనిలో గోమూత్రికాబంధచిత్రము నైతముకలదు.

453 ప్రభాసము = కాంతి. 455. రామేశకవియను నతఁడు నన్నెచోడుని కాలమునకుఁ బ్రఖ్యాతుఁడై యుండునని ధ్వనితము ఉఱవే = గొప్పతనమా. ఈపద్యపదశకము కవి వాల్యమునన్ యెవ్వడో తెనిఁగించెయుండె తరువాత దీనిలో నెక్కించుకొన్నట్లు తోచుచున్నది. 461. ఆత్మవాదులు = కపటవేదాంతులు, లేక కపట యోగులు. వ్యవసాయవాదులు = వ్యవసాయమున నపూర్వమార్గముల నుపదేశించి ఫలాధిక్యముఁ జూపుదు మనెడు కపటదేశికులు. కన్యావాదులు = కన్యలఁ దెచ్చి వివాహము చేయించి ద్రవ్యముగొనువారు. దివ్యౌషధవాదులు = రసాయనౌషధములచేఁ జిరజీవులుగాఁ జేయుదు మనువారు. ధాతువాదులు = తాళకహింగుళకాదిధాతువుల రూపాంతరములఁ గల్పించువారు. 463 ఆధారాధేయ = దేహజీవాత్మరూపసంబంధము వదలి పరమాత్మను బొందుదురు. 466 ఉదరిపడ = భయపడి. 469. గుఱ్ఱ = శిబిరములు (గుంపులు) 471 ఎలర్, ఎరల్ = గాలి. పరభాగలీల = పరస్పర సమానశోభ. 474 వెలుఁగఁ దన్నిరాజసద్యోతు లని మార్చినచో నన్వయము సుకరమగును. 477 పరభాగిల్లుచు = సమానముగా శోభిల్లుచు. 478. హయవర్మ = గుఱ్ఱముల కవచములు. 479 అవయవంబునన్ = సేనాంగములచే, జయఘంట మొదలగునవి. రాజ, అబ్జములు-తారక విరోధి విషయములు. 480 తొడవుపోలె = ఆభరణమువలెనే. 482. చామరలు = వింజామరశబ్దములో స్త్రీలింగరూప మగపడుచున్నది. కన్నడమునను బ్రతిరూపము కలదు. పడిసేసి - కూలిగా దిన వెచ్చమును నియమించి.

485. హంసములు వర్షోదబిందువుల కోర్వఁజాలక వర్షర్తువున భూమి నుండి మానసంబునకుఁ బోవునప్పుడు క్రౌంచ మడ్డపడి మార్గనిరోధమొనర్చె. 486 పెట్టు = ఆహుతి. ఇరుమెయి = రెండుప్రక్కల, అచ్చరువు = ఆశ్చర్యము. ప్రాకృతకర్ణాటకములం దచ్చరియమని తద్భవము. తెనుఁగున నచ్చెరు వచ్చరు వని రెండురూపములు గలిగె. 491. అఱకొనక = ధర్మము నాలోచింపక. (అఱ = ధర్మము) దొఱవు = క్షేమము. 498. పూన్కి = సేనాంగములు పూనిచి. 503. నోటికండ = భయము. మార్వలసిరి = శత్రువులై సమిగూడిరి. (మాఱు = శత్రువు) 501 శబ్దాలంకారము. 508. మన్నాన = భూమిమాన. "మణ్ణానయుఁ బొన్నానయుఁ। పెణ్ణానయు లేని వాడు పెన్నెఘలనుచున్" కాకమ, 516. ఓర్చుడు = ఓర్చుట, వావిరి = అనుగతముగాఁ జూచెదు.

516. రజ్జుచెప్పుడు = త్రల్లడముగానుట. చూతె = చూచితివా. 518, తార. కవి, రచిత. ఇందుఁ గవియనఁగా శుక్రుఁడని గ్రహించినను శబ్దశ్లేష వను పడదు. నన్నె చోడుని కాలమునఁ బ్రఖ్యాతులగు తారకవియుం సుక్రఖకవియు నుండిరని తోచుచున్నది. 519. ఎడసొచ్చి = నడుమఁజొచ్చి, 423. పురుష రత్న = శ్రేష్ఠులగు పురుషులు, పురుషజాతి రత్నములు. వజ్రాదులు, 536. ఉఱఁడు = సరకుసేయఁడు. కలితనము = శూరత్వము. (సామర్థ్యమనుట దోషము) కలియనఁగా శూరుఁడు. "కలిపందె యెందు బగెయదె। కులజం కుల హీన నెందు బగెయదె తరుణం। నలెవృద్ధ నెందు బగెయదె। నెలసువనిన్నిం నికృష్టరెంబరు మొళరే." గదాయుద్ధం. ౯—౯. (ఇంచశ్వత్థామ దాయ్యుడిక్కిని దూషించుచున్నాఁడు. కలిపందయనుచుఁ దలఁపక కులఁజుడు కులహీనుఁడనుచుఁ గొంకక యువవృద్ధులలో వివేక మెంచక యలరెడు నీకున్ నికృష్ట లనఁగాఁ గలరే.") కలితనమునకు—"నినగేనం పెళ్వె నాకామన కలితనమం వీరనా దంగె" లీలా ౧౧, ౨౧. 526. పవివలని = వజ్రాయుధప్రశక్తిని. పలుకు = తిట్టును. ఏర్చుడు = కాల్చుట, 528. వేల = చాయాము. కొండిక = బాలుఁడు. కోలు = కొనుట. 529. "ఇంద్రుని మంత్రి దుర్మంత్రమున నింతచేసె" 530. కుదుము = ముద్ద. (ఇప్పడ పుట్టినవాఁడు) తాను = దేవతలు. అక్కల = అయ్యో ఎత్తికొంటిరి = ప్రయత్నించితిరి, 531. చెనయుడు = చెనయుట.

535. గాలాము = చేఁపలఁబట్టుముల్లు. గడ = దండము. కొమ్ము = శృంగము. ఎఱ = ఆహారము. ఎరియ = మండ = కాల్చు. 536. వెలువు = కంచె. 537. పనుఁబావ యను రూపమే సాధువని తోచుచున్నది. "పసని మొగంబులు = లేఁత మొగము లనుచోటనుఁ బసుని యని ప్రాచీనరూపము గలదు". తలము = శక్తి. 538. గంథము = గర్వము. 543. మాత్రుఁడు = మావటివాఁడు. 556. తలియకు = పంటము. 557. ఇమ్ము = ఇక్కట్టు. ఎడపు = ఎడఁబాటు. 561. తెలచు = కోపము తేర్పించు "శూరుఁడు ఖడ్గము శత్రువులపైఁ బ్రయోగింపక పంచయై మగిడివచ్చెనేని ప్రణయకోపమున నున్న ప్రాణేశ్వరి పైకిఁగాక మఱియెవ్వరిపైఁ దనఖడ్గముపయోగింపఁగలఁడు." 562. అనిచావు = యుద్ధభూమరణము. 563. పై పెట్ట = పైకివచ్చికొట్టిన ప్రహారణము నకు, 564. ఈ పద్యములోని శ్లేషార్థము నాకు స్ఫురింపదయ్యె.

572. ముష్టి = వెంబడి. 578. "అమృతాబ్ధి . . లేక" పోల్చిచూడుఁడు.

"పాలమన్నీటిలోఁ బవ్వళించినయట్టి నీలవర్ణుఁడు నిద్రమేలుకొనెయె" విక్ర. యాదము = నీరు. సప్తమికిఁ బ్రథమ చింత్యము. గోపతి = నంది. ఉబ్బుసు కించి = పిఱమి.

575. ధారలు = సైన్యపుమొనలో ముంపటిభాగములు. "ధారాసైన్యాగ్రిమస్కంధే తురంగగతి పంచకే" వి. ప్ర. తలతంత్రము = యుద్ధభూమిలో మొదట సవరణఁ జేయఁదగిన నాయకుల సమూహము. సహవాసులు = కుబ్జక్లీబాద్యంతఃపురరక్షులు. 582 అరదము = రథము. ఇది తత్సమపదమని తోచుచున్నది. 587. ముంగలి = ముంగలగా. పింగలి = వెనుక. వాగు = సైన్యము. 590. పించు = పొడి = పిండి, 594. ప్రోవిడు = కుప్పవెట్టు. 595. పీలితొంగళులు = నెమలి యీకలకుచ్చులు. 597. నిట్ట = చక్కఁగాబైకి. 600. మండియ = చావడి. వీళ్లు = శిబిరములు. 604. తర్గంగా = తగ్గఁగా. నుర్గాడన్ = నుగ్గుచేయఁగా. మర్గింతు = మ్రగ్గఁజేయుదును. తర్గు, నుర్గు మర్గు—ప్రాచీన రూపములు. 605. మార్వెట్టక = ఎదిరించి కొట్టక. 606. మగ్గి = మ్రగ్గి. ఉఱివిపనక్రియ = కోసినట్లు. కతికండలు = రూపాంతరము. "నుడియెచ్చం కడిఖండమాగె" పంపరా-౯-౧౨౮. 607. బాకు = చేయీఁటె. నీరు = ధార. గొడుగును ధ్వజమును బట్టుకొనుట జయచిహ్నము. గొడుగు క్రిందివాఁడు సేనాపతియే. 610. కవిదల = ఆక్రమణము. సవడికాఁడు. సవసినెదిరించినవాఁడు. ఎద్దలు = హృదయములు. ఈట = ఈఁటె. కడితల = పొడిచెడునాయుధ విశేషము. లేక కేడెము. "కెంబలకెయతొలమింసంధ్యాంబుదమంపడెదు ఇడిమ కడితలె దూగుత్తంబిడవెసెవెంబలగమిగెంది నెగం తాగిపత్తు భార్గవసైన్యం." అనం. ఎంప = ఎముకను. ఉర్చుడు = కోసివేయుట. పనిక = ఆయుధభేదము. ముక్కొయ్యలు = మూఁడుతునుకలు. గుంటు = ఒక యాయుధము. మాఱుపీట = విరోధిమొనలో. 612. మునుము = తరము = క్రమము. పంచల = కపాలము. "రాహుమంచల ప్రాయమెనిప్పదాన వరపంచలెగళ్ రవి మంచలంబరంబాయె" పంపరా. ౧౩. ౬౭. మూర = బలి. పేర్చు = విజృంభణము. "మృదుమాధుర్యరచిస్సుధాంబుధిగె పెర్చంమాళ్పచంద్రోదయం మదసంపూజిపమంత్రదేవతె" జగ 614. షుటమిశబ్దము సంస్కృతమో లేక కరకంఠాదిశబ్దములు వోలె సాధువులయ్యెనో కాని యాంధ్రకర్ణాటభాషలలోఁ బుటమిశాది సమాసములు బహుప్రామాణిక ప్రయోగములలోఁ గానవచ్చు

చున్నవి. కన్నడమున "పౌడమీఱంగదెయ నెత్తి తెరెపెప నాగశ్" గదా. ౮—౪౦.

616 పొడప్ర = కేవలరూపమును జూడఁగా. ఆశలు = స్త్రీలు. ఆలు = స్త్రీ. తూఱు = ప్రవేశించు, ఎత్తు = పైకెత్తివచ్చు. పోరు = యుద్ధము సేయు. 518 తెరలు = చెదరు 620. గాలిపడగలు = వీరధ్వజములు, పెంద గడియ = ఆకాశబాణములు. వఱడియలు = కరదీపికలు. వీరమద్దెలలు = బిరు దందెలు. 622 ఇప్పుడు = ఇచ్చుట. ఆయము = ఆయువు. లెయ్యము = నెయ్యము. 624 ఓలము = దాఁపటికము = మఱుఁగు. కూర్చు = ప్రేమించును. ఆలము సేసి = బయలుపెట్టి. ఆలనె = స్త్రీనా. 625. కాన్పు = చూచుట. "నేనే పేవకామినిపైౖ యుండఁ పోరఁ జచ్చి వేఱదేవాంగనలఁ బొందుటకెట్లు ప్రియుఁడు సమకట్టెనని సంచలించె." 635 పడవాళులు = చిన్నసేనాపతులు. 637 ఈవి = ఇచ్చుట. 639 అంగతలత్రములు = కవచము, గోధ. 641 మహామాత్రులు = మావటీలు. 645. జయమాళి = ఒకవ్యూహభేదము. "మకర వ్యూహం బొందెను వికటాస్యంబైనయట్టి పేరాసనచూళికయైనఁ బన్నిచనునది ప్రకటితశౌర్యమున సెపర భయమొదవునెడ౯" అని ప్రాచీనలక్షణములలోఁ జూళీశబ్ద మగపడుచున్నది.

646. మేఘడంబరములో = ఆతపత్రములో. "తలెవరిదానెసుత్తి పలవుం బరెత శిలె మేఘడంబరం। లలనెయరికైచామరమ" పంపరా. ౫—౧౦౮. అరద = రథ. తమ = చీకటి. రజస్సరస్తమోమనశ్శబ్దము లకారాంతములు గలవు. ప్రాయికముగా నాంధ్రమున ముపర్ణకమువచ్చు సకారాంతశబ్దములకెల్ల సంస్కృతమున నకారాంతరూపములు గలవని తోచుచున్నది. "శిరోవాచి శిరశ్శబ్దో రజోవాచి రజస్తథా। శిరశ్చరజ ఇత్యేవ మకారాంతేచ పుంసిచ" "రజోగుణే విషేపుష్పే రాత్రే స్వాంతే గుణేతమః" శ్రీహర్షుని అమరఖండము. "తమః పుంసి గుణేరాహౌ ధూఃధ్వాంతార్తవాదిషు। తమాతమిత్రసుస్యాపి ధ్వాంతాదిషు నమీహితం" మంజూషా. 653 కాఁపువచ్చు = పెనుటకువచ్చు 659. పొయిప్ర = చక్కదనము.

660 వాయవారి = శత్రుపక్షముయుక్కు. దొరవారి = ప్రభువును (తారకుఁడు-ప్రభువుగాన నట్టిపేరుగలవాఁడె దెక్కుంత్రను) ఇట్లె-రాచవారు = రాజు, ("కోయిల రాచవారి" = కోయిలరాజును. ఉ. హరి.)

665 వందం = పక్షి. 672. రేపు = విజృంభించు. 673. చేతులువీచుట-యుద్ధానుజ్ఞ సూచకచిహ్నము. "అంతుబంపుకై పిసుపుడుం" పంపరా. ౧౩-౬౫. 687. నోఁ = నొవ్వఁగా. 688 బరులు = ప్రక్కలు. 690 సలమున = చలమున. మార్బలము = శత్రుబలము. "ఊర్వలదచతుర్బలముం దోర్బలమంమెఱదు మీఱి కాదుప వదదొళ్. మార్వలమం." పంపరామా ౧౦-౧౬౯. సలరేవం = చెలరేఁగునకుఁ ప్రాచీన రూపము. 692 గఱి = (బాణపుంఖములకుఁ దగిల్చియుండు) ఱెక్క. "వికసితనీల నీరజదళం బొలిపల్గఱి" కాదం - ఉత్త. ౬౧ మొల = చీల. సలలు = వత్తులు. పెదులు = పెట్లు = విచ్చు. 694 తొట్టుకొని = ఒకటినొకటి యొరసికొని = నిండి. 695 నెక్కిరి = డగ్గఱించిరి = త్రొక్కిడిసిరి. వెక్కిరి = వెక్కిళ్లు విడిచిరి. 700 నఱుము = పొడి. నెత్తురుపొత్తు = రక్తసంబంధము. "కుహనా వరాహంబు కూర్మినెత్తుపొత్తుచుట్టంబు లక్కాన సూకరములు." ఉద. ఆ-౩. 704 గజజాతులు. మూఁడు. "భద్రమందమృగభేదత స్త్రిధా జాతిరత్ర కరిణాం పురోదితా" వీనిమిశ్రము సంకీర్ణజాతి. ఆసనములుమూఁడు "క్రమాత్త్రీణ్యాసనానిస్యుర్ముఖ్యమధ్యాధమానిహి। ఏకఃప్రసారితః పాదస్తదన్యో నత జానుకః। పాశ్చాత్యమాసనం జ్ఞేయ మేకం జానుగతంబుధైః..." అంకుశ చారణలు షడ్విధములుగా నవీనులు గ్రహించిరి. నన్నెచోడాదిప్రాచీనులు నాల్గు విధము లనిరి. "వితానేచ విదుక్త్రిభాసిన్యాణే మస్తకేపిచ। అవగ్రహేచ జానీయాత్ షడ్విధాంకుశచారణా" ప్రణిధులు = మావటీని యాజ్ఞఁ దెలుపు మార్గములు. ఇవి మూఁడు. "వాక్పాదాంకుశచోదనా ప్రణిధిరిత్యుక్తా" ప్రచోదించుచు = తోలుచు. మొగవదంబు = ముఖకవచము. వీసర = వెలిఁ తిఁబడి. 713. ఉరిపము = కోత. 715. మార్బలము = శత్రుబలము. అత్తలఁ = ఆప్రదేశమున. "అత్తలసురారి బెసనిన నిత్తల్ రుద్రావతార నెళదుద్యప" గదా. ఆ - ౬ - ౨౨. "చాపుతలనైన నించుక సత్యవాక్య ముగ్గడింపు" భోజ -౫ ౩౧౫. 719. అడగొని = అట్టెటుకట్టి.

726 చోటు = మత్స్యము. 730 అబమి = ఒత్తి. 731. వెక్కువు = వెక్కువ = ఆధిక్యము. 737 రాటనము = రసము తీయుయంత్రము. గుంద్ర = త్రిప్పెడుపైగుంటు. 738 కిలలుపు = అలుసు. 739 బరులు = పక్కలు. తెట్టె = చీలి. ఎటఁగి = ఆరోహించి. (ఇది యవరోహణమున సాధారణముగాఁ బ్రయోగింపఁ

బడును.) 740 నెరణి = మాంసము. వేతాలుఁడు = భేతాళుఁడు 744 ముష్టి = తత్క్షణము. 759 అడగొని = అట్టకట్టి. 760 కెడ్బేరను = కలసిపోయి. ఖరదండ = జలపుష్పము. ఆయుధవిశేషము. రెండర్థములకును "కృష్ణం పవేధ ఘటాకోటిగళెత్తి బర్పఖరదండంగళ్ విఖండంగళా। గెఘనధ్వాంతమనెద్దెపొపె పుదిదిర్ధాకాశవారాశి ఘోరఘనోర్మిప్రకరంబొలేనినిసువేగంకణ్గగుర్వాదుదో" జగ. 763. అరదకమరము = రథము లను హర్మ్యములుగలది 768. తవిలించిరి = ప్రేమింపఁజేసిరి. 773 కైపీఁగి = చేప్రాలి. 774. సలలు = వత్తులు. 784 పక్కర = పక్కెరలకుఁ ప్రాచీనరూపము. కందియన = కందెన. 801 కనువడి = తాఁకునట్లు.

802.ముట్టి మూదలించి = తాఁకునట్లు మర్మస్ఫోటనము లాడి పిలిచి."హరిసంధానక్కె వందం దవగడిసిపహంకార మెల్లిత్తొ కృష్ణాం। బరకేశాకృష్టియం మాడిసిదమద మెల్లితొ కౌంతేయరంమ। చ్ఛరవింకాంచాపదోళ్ తిట్టనె తిరుపిద సౌర్కిగళే నాదుదెం దా। కురువంశాధీశనం మూదలిసెప నపటం భీమ నుద్దామ భీమం "వ" అంతుముట్టి మూదలిసియు మెంతుం పొయిమడిసలాయిదె." గదా - ఆ ౭. ౧౯. తాఁకెపమెుస్టిన = తాఁకిన వెంబడి. 307. ముప్పిరివడ = పంక్తిపైఁ బంక్తి పడునట్లు 828. విగుర్వణము = విజృంభణము. 842 కట్టు = కట్ట, 845 కవిదల – ఆక్రమించుట. 856 పొదిపెరిసి = కట్టువదలి. కుముపము = వ్యసనము. సురరాజు = ఇంద్రుఁడనుచంద్రునియొక్క. 867. కుందెలు-కుంద్రెలు - ప్రాచీనరూపము. (కుంద్రు = కొండ. ఎలు = ఎలుక.) 861 కరువపోలె = కరువు పోలెనే, గణప = ప్రమథగణపరులనెడు.

882. కవి = పూవున. కునిసియాడ = నాట్యమాడ. "గంధర్వరంతల్లి గాయన రింద్రాంగ నెయర్కళల్లి కుణివర్" అజి - ౪ - ౮౩, "లయదిం దెళలదె కుణిదక్ కెలబర్ కలరుతిగళె రాలహాగె కుణివక్ కెలబర్" అజి - ౫ - ౩౦. "ఆనందం బెర సంకదచ్చరసెయక్ దేవేంద్ర నైరావతా। లాన స్తంభసమంగళప్పుఘుటసంచోహంగళోళ్ వీరకాం। రానీకక్కెయొయాగె హాదెసువర్ మత్తం కెలర్ నోడిసూ। చీనాట్యంగళనాడిదర్"ఆది, ౭ - ౧౨౩. 887.నసియాడితి = తెంపాడితి. 892. తావికొని = ఇటునటు పొలయించి. 902. కాఁచినమద్దులు = కొంచెము కాల్చిన నల్లమద్ది ప్రాకులవలె. 936 ఎత్తికట్టె = నిలువుకొనెను. 945 ఉద్ద = ఊరక. 946 అపమానము. "అపమానిసి దర్పాణా। తపమెలసిద పుండరీక షండదసొబగుం। చపలాక్షియ కోమలపా। ణిపల్లవ స్పర్శ హర్షదిం

రఘురాముం'' పంపరా. ౫ - ౧౩౧. 959 ప్రోవెట్టు = కప్పవెట్టును. 960 కొమ్ములు = పెంపకొనలు, ఏనుఁగు కొమ్ములు. 968 గవనము = సమూహము. 972 లగుర్వుగ = భయంకర మగునంతయుచెనముగ. ''మొనమొన్ భైరవనం తగుర్వువడెదం రామానుజం'' పంపరా - ౯ - ౧౨౩. 974. ''భుజా స్తంభా గ్రమున జయశ్రీఁబొందె సాలభంజికవిధమున'' — ''శ్రీరాస్తాం మనుమక్షితీశ్వరభుజా స్తంభే జగన్మండలం ప్రారంభస్థిరభారధారిణి యస్మిన్ శ్రీసాలభంజీశ్రియం'' నిర్వ - ఆ ౧ - ౧. 977. చనుము = సమూహము, ముక్కున బంటిగ = సహింపరానివస్తుగ. 980 ఈచక్రబంధమునఁ గృతిపతి కృతికర్తృ కావ్యనామములు గానరావు. 987. పరిపూర్ణముగా మనోనురాగాదుల పరస్పరసాహచర్యసాయుజ్యములు కలిగినను దేహము లేకత్వైక్యభావము నొందినను వేఱుగా యుండుటచే వారి సాంగత్యమున నింకయు విరహావస్థ కొంతయున్నట్లే కావునఁ బరిపూర్ణానంద సాయుజ్యమునకు మనసు గాక దేహములు నైక్యమగుటకే యర్ధనారీశ్వర రూపము కావలసి వచ్చెనని కవి శృంగారస్థాయి విభావమునకుఁ బరమోచ్చగతిని వర్ణించెను.

994. నన్నెచోడునికాలమున బృహత్కథ పఠనీయగ్రంథమైయుండును. 995. ఉద్ధృతకందము—భవబంధములఁ ద్రెంచుచు భువిలో నజ్ఞానవదముఁ బొందకత్రెళ్లుల్ । శివుఁగొల్తు రచలభావన దవ్విలఁ సుజ్ఞానయోగ తత్త్వవిధిజ్ఞుల్. 997. ఉద్ధృతకందము—మనమారఁ గొల్చువరు దాతనిఁ గొల్చియు నావిపోడ దాఁటెరయునెపూ । జనదాయజో్గ్రగ శరపాతనియు కవచంబుసంపఁ దాఁ బొర యఁడు పో. 998. హఠాదియోగులు మాంసాహారము రోగరాగజనక మనిరి. భగవద్గీతలో - మాంసాహారము రాజసాహారమని వ్యాఖ్యాతలు చెప్పఁబడఁగా శివయోగరాజయోగముల దాని నిషేధింపకుండుట యూహ్యము. ఏ యోగము నందును ప్రారంభమున భోజన నియమము కలదు. నియతేంద్రియుఁడై చిత్తసమాధివైకల్యము చెందకుండెడు స్థితిలో నాహారనియమము పాటింపడు. అట్టి విజ్ఞానదశనే కవి సూచించెనని తోచుచున్నది. 1001. ఈ పద్యమున క్షేత్రక్షేత్రజ్ఞ సాయుజ్యస్వరూపమును గవి వర్ణించుచున్నాఁడు. క్షేత్రమనఁగాఁ బంచవింశతి తత్త్వములు. ''బుద్ధీంద్రియాణి సార్థాని మనః కర్మేంద్రియాణిచ । అహంకారశ్చ బుద్ధిశ్చ పృథివ్యాదీనిచైవహి । అవ్యక్తమాత్మా క్షేత్రజ్ఞః క్షేత్రస్యాస్యనిగద్యతే.'' 1004. ఏఁచ = వెలుఁగెక్కువచేయుటకు. నిల్ప స్థాపింప (ఆవాహింప).

| పద్యసంఖ్య. | పాదసంఖ్య. | |
|---|---|---|
| 296 | 2 | వెల్లచనియె. |
| 329 | 3 | జక్రియాగము |
| 330 | 2 | న్నరయరె. |
| 346 | | సేయకతీవ్ర. |
| 348 | 1 | సంచించుచున్నట్లు |
| 373 | | సూల్చివెనవీపికాస్య నాకినపిపికాకృతిన్ |
| 383 | 4 | శరణవసరని |
| 415 | 4 | సంభవంబులందెలన్. |
| 421 | 1 | నెపంబూడి వినివి కాలిచ్చులో, ముదిమితో |
| 494 | 4 | గనియంగా రోపమంచారకున్ |
| 531 | 2 | కారణ వనవహ్ని కెచ్చుటితృణకరంబు. |
| 537 | 6 | పసుఁబావ |
| 538 | 1 | కళాబంధంబు. |
| 538 | 3 | నె య్యానిపైనెత్తిన. |
| 543 | 4 | మహామాత్రుక్రియన్. |
| 567 | 1 | మునసపతీరోల |
| 584 | 2 | పరమేశ్వరునంబుధిఁబోలి |
| 615 | 1 | సేవకుసమ్మ్రింపవలయు. |
| 648 | 2 | సంగరాంగణంబునం |
| 649 | 6 | కాయ్పుతో. |
| 663 | 4 | నిర్భేషుఃబామ్యాల్ |
| 664 | 3 | విన్నాణములుసూపు. |
| 681 | 2 | హరణపులుశబ్ద. |
| 687 | 2 | నోఁబోట్లు |
| 910 | 3 | యెక్కుదనంపు. |
| 923 | 2 | చెరువాడిరి. |
| 977 | 1 | ముక్కునబంచిగ |
| 980 | 4 | శాక్తైయో. |
| 1001 | 3 | లోకాఖ్యమకామ్యాదుస్పదిత కుంభ. |
| 1004 | 4 | శేఖరుఁడు సకలముని ముఖ్యుఁడు. |

## కుమారసంభవవ్యాఖ్యానోదాహృత గ్రంథ నామసంకేతవివరణము.

భార = కవిత్రయము వారి భారతము.
విజ = తిక్కన విజయసేనము.
హరి = ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశము.
నృసిం = నృసింహపురాణము.
భేతా = కవిభల్లటుని విక్రమార్కచరిత.
కలా = పిన్నెచోదుని కళావిలాసము.
ప్రద్యు = పిన్నకోట పెద్దన ప్రద్యుమ్నచరిత
కావ్యా = కావ్యాలంకారచూడామణి.
కుమా = ఎఱ్ఱాప్రెగ్గడ కుమార నైషధము.
మల్హ = ఎఱ్ఱాప్రెగ్గడ మల్హణకథ.
నైష = శ్రీనాథుని నైషధము.
కాశీ = కాశీఖండము.
ఉ. హరి = నాచనసోముని హరివంశము.
సప్త = శ్రీనాథుని సప్తశతి.
వల్ల = వల్లభాభ్యుదయము.
అని = పెమ్మసయనిరుద్ధచరిత.
విక్ర = జక్కన విక్రమార్కచరిత.
నీతి = భద్రభూపాలుని రాజనీతి.
హరిలీ = తెనాలిరామలింగని హరిలీలా విలాసము.
కంద = రామలింగని కందర్పకేతువిలాసము
పద్మి = పేరయ పద్మినీవిజయము.
నిర్వ = తిక్కనయుత్తరరామాయణము.
విక్రమ = అమరేశ్వరుని విక్రమసేనము.
శివ = కవిలోకబ్రహ్మ శివజ్ఞాన దీపిక.
సావి = దుంసిబసవన సావిత్రికథ.
దశ = కేతన దశకుమారచరిత.
కాదం = కేతన కాదంబరి.
వీధి = వల్లభరాయని వీధినాటకము.
ప్ర.ప్ర = సూరన ప్రభావతీప్రద్యుమ్నము.
ఉద = సూరన యుదయనోదయము.
శాకుం = పినవీరని శాకుంతలము.
కువ = ఏర్చూరిసింగన కువలయాశ్వచరిత.
ప్రద్యుమ్న = మాధవుని ప్రద్యుమ్న విజయము

### కన్నడమున

కవిరా = అమోఘవర్షుని కవిరాజమార్గ.
విక్రమా = పంపకవిభారతము.
గదా = రన్నకవి గదాయుద్ధము.
జగ = జగన్నాథవిజయము.
అర్ధ = నేమిచంద్రుని యర్ధనేమిపురాణము.
మల్లి = అభినవపంపని మల్లినాథపురాణము.

### ద్రవిడభాషలో

జీవ = జీవకచింతామణి.
మణి = మణిమేఖలై.
కలిం = కలింగత్తుపరణి.

### సంస్కృత ప్రాకృతముల

గౌడ = వాక్పతిరాజ గౌడవధ.
సేతు = ప్రవరసేనుని సేతుబంధము.
నవ = పద్మగుప్తుని నవసాహసాంకచరిత.
కుమా = ఉద్భటుని కుమారసంభవము.
కలా = క్షేమేంద్రుని కలావిలాసము.
శ్రీకం = మంఖుక శ్రీకంఠచరిత్రము.
మంథా మంథానభైరవకల్పము.
ఘండ = ఘండకాపాలికతంత్రము.
రసా = సిద్ధరసార్ణవము.
రసర = సిద్ధనాథుని రసరత్నాకరము.
ఔచి = క్షేమేంద్రుని యౌచిత్యవిచారచర్చ మరియును.

అథర్వణఛందము, కవివాగ్బంధనము, కవిలోకసంజీవని, లక్షణసార సంగ్రహము. (పెద్దన), లక్షణశిరోమణి (వేంకటకవి), అప్పకవీయము, కవిజనాశ్రయము (గోకర్ణుఁడు) మొదలగునవి.

**వివరణము:**

రామకృష్ణకవిగారు 12 ఆశ్వాసముల 'కుమారసంభవము' ను రెండు భాగములుగా వేర్వేరుకాలములలో ముద్రించిరి. మొదటి సంపుటమందు (1909) ఏడు ఆశ్వాసములును, రెండవ సంపుటమందు (1914) తక్కిన ఐదు ఆశ్వాసములును గలవు. నేటి ఆచారము ననుసరించి కవిగారు ప్రతి ఆశ్వాసమునకును వేరువేరుగా పద్యసంఖ్య నీయలేదు—మొదటి సంపుటమున నేడు ఆశ్వాసములందలి మొత్తము పద్యసంఖ్య 996; ఇక రెండవ సంపుటమున నైదాశ్వాసములందలి మొత్తము పద్యసంఖ్య 1009. పాఠకుల సౌకర్యమునకై కవిగారి ముద్రణమును ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమివారు ప్రకటించిన ముద్రణముతో పోల్చి ఆశ్వాసముల పద్యసంఖ్యలను వివరించుచున్నాము—సం॥

| ఆశ్వాసము | కవిగారిముద్రణలో సంఖ్య | అకాడమి ముద్రణలో సంఖ్య |
|---|---|---|
| ప్రథమ | 1-135 | 134 |
| ద్వితీయ | 136-243 | 110 |
| తృతీయ | 244-356 | 113 |
| చతుర్థ | 357-479 | 123 |
| పంచమ | 480-657 | 178 |
| షష్ఠ | 658-881 | 172 |
| సప్తమ | 882-996 | 160 |
| అష్టమ | 1-199 | 199 |
| నవమ | 200-366 | 167 |
| దశమ | 367-570 | 206 |
| ఏకాదశ | 571-781 | 214 |
| ద్వాదశ | 782-1009 | 229 |

# 3. క్రీడాభిరామము
## వల్లభరాయఁడు

ఇక్కవి హరహరరాయల భండారమున కధ్యక్షుఁడు. ఆతని గ్రంథము క్రీ. వె. 1420 లోఁగా రచితమైనది. అనఁగా శ్రీనాథుఁడు నైషధము తెనుఁగు చేయునంతకు రచింపఁబడెను. ఇతనితండ్రియగు తిప్పన్న "గంధవతీప్రతీర పురఘస్మరపాదవిసప్రసూన పుష్పంధయచక్రవర్తి శ్రుతిపర్వతదుర్గ మహా ప్రధాన రాజ్యగంధగజంబు" అనియున్నందునఁ ద్రిపురాంతకదేవుని పాదభక్తుఁడనియు, వినుకొండపరిపాలకుఁడనియుఁ దెలియుచున్నది.

ఈగ్రంథకర్త నెల్లూరను పెనాకెసికేహము కాలువను గట్టించినట్లు "నెల్లూరి తూముకాలువ హల్లకములకమ్మఁదావినవలాపించుఁ" అనుటచేఁదోఁచుచున్నది. ఇది సంస్కృతమున రావిపాటిత్రిపురాంతకుని ప్రేమాభిరామమను వీధినాటకమునకుఁ దెనుగు. మూలగ్రంథము నాకులభింపలేదు. ఈత్రిపురాంతకుఁడు, త్రిపురాంతకోదాహరణమును, మదనవిజయమను రతిశాస్త్రమును, అంబికాశతకమును,తారావళియును రచించియున్నాఁడు. ఉదాహరణ మనఁగా నొకవృత్తము, నొకకళికయు, నొక యుత్కళికయు నిట్లేవరుసగాఁగల కృతి. ఈగ్రంథమును నేను పూర్ణముగాఁజదివినాఁడను. అంధ్రముననిట్టిహృదయంగమమైన భక్తిరసప్రధానమగుకృతి పెక్కులులేవు. మదనవిజయము వాత్స్యాయన ప్రణీతమగు కామసూత్రములకుఁ దెనుఁగు. అంబికాశతకము మనోహరములగు భావములు గలిగిన్న పార్వతీస్తుతి. తారావళియు సరసభావములుగల చంద్రస్తుతి. ఇతని కవిత్వము మిక్కిలి మృదువై యతి మధురముగానున్నది. ఇతఁడు త్రిపురాంతకదేవుని వరప్రసాదమునజనించి తదనుగ్రహముననే కవిత సంపాదించినవాఁడు. ఇతనిని వల్లభరాయఁడు నన్నయ్య తిక్కన భాస్కరామరేశ్వరుల కీడుగాఁ జెప్పియున్నాఁడు. నాయభిప్రాయమించుక భేదముగానున్నది. అమరేశ్వరుని కవిత మిక్కిలి యర్థగాంభీర్యము గలిగియున్నను త్రిపురాంతకుని మాధుర్యము దాని యందులేదు. తిప్పరాజు కవిత్వములో భావములు విరళమై, పదబంధమించుక శిథిలమైయుండును. అమరేశ్వరుని కవిత భావకాఠిన్యము గలిగి గాఢబంధము గలది. ఈతిప్పరాజు క్రీ. వె. 1600 శతాబ్దమున నుండెనని కవులచరిత్రములో వ్రాయఁబడియున్నది. అప్పకవి యుదాహరించిన "సరిబేసైరెప్ప దేలచోఁ..." అను

